## ప్రతి గ్రంథాలయంలోను ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
**Rs. 5-25**

**'THE NECTAR OF THE GODS'**
**Rs. 4-00**

పిల్లలకు బహుమతిగా ఇవ్వతగినవి.



కాపీలకు:

## డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

---

## శ్వాన్ పెన్నులు
## అంతరిక్ష యుగ విద్యార్థులకు







ఆధునిక తరానికి శ్వాన్ పెన్నులు. శ్వాన్ మాత్రమే మెత్తగా తేలికగా జారిపోతూ వ్రాస్తుంది. శ్వాన్ ఆక్స్‌ఫోర్డ్ గాని కేంబ్రిడ్జ్ గాని తీసుకోండి—ఆనందంగా చంద్రగోళంపై అడుగుపెట్టండి.



శ్రేష్ఠమైన ఫలితాల కోసం




**శ్వాన్** డీలక్స్ ఇంకుతో వ్రాయండి.



hero's SI-120 11

**శ్వాన్** (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
అద్వాని ఛాంబర్స్ పి. మెహెతా రోడ్డు, బొంబాయి-1
బ్రాంచి: 34-బి. కన్నాట్ ప్లేస్ క్రొత్త ఢిల్లీ.



ప్రతి సంవత్సరము దీని ప్రసిద్ధి పురోగమనము పొందుతున్నది

# లిప్టన్ రూబీ డస్ట్




లిప్టన్ రూబీ డస్ట్ యింత త్వరితంగా ప్రసిద్ధి పొందుటకు కారణమేమి? ప్రతి ఒక్క ప్యాకెట్టుకు అధిక కప్పులు టీని కోరే మీవంటి ప్రజాబాహుళ్యమే కారకులు. దీని కమ్మని రుచి, యింపైన సువాసనతో కూడిన చిక్కని డికాక్షన్ తప్పనిసరిగా తృప్తి నిచ్చుచున్నది.



ప్యాకెట్లలోవున్న టీ మాత్రమే తాజాతనము, సువాసన నిలిచివుండును

## ఒక్కొక్క ప్యాకెట్టుకు అనేకమైన కప్పులు హెచ్చుగా ఇవ్వడమువలననే మీ ఆదరాభిమానాలు పొందగలిగినది

LRDC-8A/73 TEL



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

యుద్ధానికి అంతా సిద్ధమైనాక కూడా ధర్మరాజు తాను చేయబోతున్నది అధర్మమేమోనని భయపడతాడు. దీనికి కారణం భారతయుద్ధంతో సమాజంలో ఒక పెద్దమార్పు జరిగింది. అంతదాకా జ్ఞాతుల మధ్య యుద్ధం అధర్మమైనది. కృష్ణుడు ఆ ధర్మానికి ఉద్వాసన చెప్పాడు. ధర్మరాజు జూదంలో ఓడినప్పుడు కృష్ణుడు అక్కడ ఉంటే ఈ యుద్ధం అప్పుడే జరిగి ఉండేది. పాండవులను అరణ్యంలో చూడవచ్చి కృష్ణుడు ఈ మాట వ్యంగ్యంగా అన్నాడు.

సంపుటి 52 జూన్ '73 సంచిక 6






ఉదయే సవితా రక్తః,
రక్త శ్చాస్తమయే తథా;
సంపత్తౌ చ, విపత్తౌ చ,
మహతా మేకరూపతా. 1

[సూర్యుడు ఉదయించేటప్పుడు ఎర్రగా ఉంటాడు; అలాగే అస్తమించేటప్పుడు కూడా ఎర్రగా ఉంటాడు. మహాత్ములకు సంపదలోనూ, ఆపదలోనూ ఒకే రూపం.]

యథా చిత్తం తథా వాచః,
యథా వాచః తథా క్రియాః,
చిత్తే వాచి క్రియాయాం చ
మహతా మేకరూపతా. 2

[మనస్సు ఎలా ఉంటే మాట అలా ఉంటుంది; మాట ఎలా ఉంటే చేత అలాగే ఉంటుంది. మహాత్ముల మనసుకూ, మాటకూ, చేతకూ ఒకే రూపం.]

మన స్యేకం, వచ స్యేకం,
కర్మ ణ్యేకం మహాత్మనాం;
వచ స్యన్యత్, మన స్యన్యత్,
కర్మ ణ్యన్యత్ దురాత్మనాం. 3

[మహాత్ములకు మనసూ, వాక్కూ, క్రియా ఒకటిగానే ఉంటాయి. దుర్మార్గులకు అవి వేరు వేరుగా ఉంటాయి.]

మహాత్ములు



# తిరుగులేని తీర్పు

ఒక ఊళ్ళో కనకయ్యా, కనకమ్మా అనే దంపతులు ఉండేవారు. కనకయ్య గొప్ప పొదుపరి; నెలనెలా వందలకొద్దీ సంపాదిస్తున్నప్పటికీ, తమ ఇద్దరి తిండి కింద రోజుకు రెండు రూపాయల కన్న ఖర్చు పెట్టేవాడు కాడు. మిగతా డబ్బు ఇనప్పెట్టెలో దాచి, తాళం వేసి, తాళం చెవి భద్రంగా మొలలో దోపుకుంటాడు. కనకమ్మ ఎంత మొత్తుకున్నా తిండికి మినహా ఒక్క కానీ కూడా ఇచ్చేవాడు కాడు.

కనకమ్మ రోజూ తన మొగుణ్ణి తిట్టుకునేది.

ఒకరోజు ఉదయం కనకయ్య ఏదో పనిమీద పొరుగూరు పోతూ, తన భార్య చేతిలో అర్థరూపాయి పెడుతూ, "ఇదుగో ఈ పూట నీ తిండికి!" అన్నాడు.

కనకమ్మ అర్థరూపాయిని తిప్పి తిప్పి చూస్తూ, "మరి రాత్రి తిండికో? కట్టుకున్న ఖర్మానికి పస్తుపడుకోబెట్టవుగద?" అన్నది అనుమానంగా.

"చీకటి పడకుండా తిరిగి వచ్చేస్తాను. రాత్రి తిండికి అప్పుడు ఇస్తాను," అన్నాడు కనకయ్య.

"మరో అర్థరూపాయి ఇస్తే నీ కొంప కూలుతుందా? ఇనప్పెట్టెలో ఎంత డబ్బు మూలుగుతున్నా నా గతి ఇంతే! చేతిలో చిల్లిగవ్వ ఉండదు. నిన్ను అని ఏం లాభంలే? వెతికి వెతికి నీ లాంటి పీనాసి వాడికి నన్ను కట్టబెట్టినందుకు నీ మామను అనాలి!" అని కనకమ్మ సాధింపుతోబాటు కళ్ళు ఒత్తుకోసాగింది.

భార్య అన్న మాటలు సరిగా వినిపించుకోకుండా కనకయ్య గబగబా ఇంట్లో నుంచి వెళ్ళిపోయాడు.

కనకమ్మ నోరు నొప్పిపుట్టేదాకా మొగుణ్ణి తిట్టుకుని, అర్థరూపాయితో వెచ్చాలు తెచ్చు

ఎం. కామేశ్వరరావు



కుని, వంట చేసుకుని తిని, ఎంగిలి విస్తరాకు పెరట్లో దూరంగా గిరవాటు వేసి, లోపలికి వస్తూండగా, అనుకోకుండా ఆమె తండ్రి వచ్చాడు.

తండ్రి వస్తూనే, "కులాసాగా ఉన్నావా?" అని అడిగేసరికి, అసలే చిరాకుగా ఉన్న కనకమ్మ రెచ్చిపోయి, "నరకంలోకి తోశావు నన్ను! ఇంక కులాసా ఎక్కడిది? నీ అల్లుడు నా చేతికి కానీ ఇయ్యడు. డబ్బంతా మురగబెడుతున్నాడు. ఇలా వేళ గాని వేళ చుట్టం వస్తే ఏం పెట్టాలి, నా శ్రాద్ధం? నా రాత ఇలా తగలబడింది, ఎవర్నని ఏం లాభం!" అంటూ తండ్రి మీద విరుచుకు పడింది.

ఆయన హడలిపోయి, "నేను భోజనానికి రాలేదులే. నిన్ను పలకరించి పోదామని వచ్చాను." అనేసి చల్లగా జారుకున్నాడు.

ఎండనపడి వచ్చిన తండ్రికి భోజనమైనా పెట్టలేకపోయినందుకు కనకమ్మకు కనకయ్య మీద మునుపెన్నడూ రానంత కోపం వచ్చింది. ఊరుకుంటే లాభంలేదనీ, మొగుడికి ఎదురు తిరగాలనీ ఆమె నిశ్చయించుకున్నది.

చీకటిపడ్డాక కనకయ్య ఇంటికి తిరిగి వచ్చి, మొల నుంచి ఇనప్పెట్టె తాళం చెవి తీస్తూ, "నేను భోజనం చేశాను. నీ దండుగ తిండికి అర్ధరూపాయి తగలెయ్యనా?" అని భార్యను అడిగాడు.

కనకమ్మ భర్త చేతి నుంచి ఇనప్పెట్టె తాళం చెవి చప్పున లాగేసుకుని, "ఇక ఇది నా దగ్గరే ఉంటుంది. ఇకనుంచీ డబ్బు నా యిష్టం వచ్చినట్టు ఖర్చుచేస్తాను. మండుటెండలో నీ మామ వస్తే కూడు పెట్టకుండానే పంపెయ్యవలసి వచ్చింది నీ మూలాన! ఈ సంగతి లోకులకు తెలిస్తే ఏమనుకుంటారు?" అన్నది.

కనకయ్య కోపం తెచ్చుకుని, "డబ్బు ఖర్చుపెట్టటం గొప్ప పనా? తేరగా సంపాదించేవాడుంటే నేనూ ఖర్చు చేస్తాను. నా తాళం చెవి నా కిచ్చెయ్యి." అన్నాడు.

"చచ్చినా ఇయ్యను," అన్నది కనకమ్మ ఖచ్చితంగా.

"ఎందుకియ్యవు? నా డబ్బు ఖర్చు పెట్టటానికి నువు ఎవతెవి?" అంటూ కనకయ్య తన భార్య చేతిలోనుంచి తాళం చెవి లాగేసుకోబోయాడు.

"నీ భార్యని! నీ డబ్బు ఖర్చు చేసే హక్కు నాకున్నది. అసలు ఖర్చు చెయ్యటానికి కాకపోతే డబ్బెందుకు?" అంటూ కనకమ్మ భర్తకు తాళం చెవి అందనివ్వక, వీధిలోకి పరిగెత్తింది.

బొజ్జ నిమురుకుంటూ వీధి అరుగుమీదికి వచ్చిన ఎదుటింటి షావుకారు ఆ భార్యాభర్తలను చూసి, "ఏమిటి మీ గోల?" అని అడిగాడు.

కనకమ్మ షావుకారుకు జరిగినదంతా చెప్పి, "మీరే న్యాయం చెప్పండి. నచ్చినా, నచ్చకపోయినా మీ మాటకు కట్టుబడి ఉంటాను," అన్నది.

"మీరు దెబ్బలాడుకోవటమేమిటి, నేను తీర్పు చెప్పటమేమిటి?" అంటూ షావుకారు అరుగు మీదినుంచి లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

నాలుగిళ్ళ అవతల ఉండే రెడ్డిగారి భార్య, ఇంతసేపూ చోద్యం చూస్తూ ఉండి, "ఏమిటి మీ దెబ్బలాట?" అని కేకవేసి అడిగింది.



కనకమ్మ ఆమె వద్దకు వెళ్ళి, షావుకారుకు చెప్పినట్టే అంతా చెప్పి, ఆమెను న్యాయం చెప్పమన్నది.

కనకయ్య తన తరఫున తాను కూడా చెప్పుకున్నాడు.

రెడ్డిగారి భార్య అంతా తాపీగా విని, "ఇది మరీ బాగుంది! నేను న్యాయం చెప్పటమేమిటి? అవతల నాకు బోలెడంత పని ఉన్నది," అంటూ అడావుడిగా లోపలికి వెళ్ళిపోయింది.

ఇంకా నాలుగిళ్ళ అవతల ఒక తల నెరిసిన వాడు ఈ దంపతులకు తారసపడ్డాడు. ఇద్దరూ అతనితో సంగతంతా చెప్పి, న్యాయం చెప్పమన్నారు.

"నేను మాత్రం ఏం చెప్పేది? ఆలి మొగుళ్ళ తగాదా ఆ భగవంతుడే తీర్చాలి." అంటూ తల నెరిసిన వాడు, తల ఎత్తి ఆకాశం కేసి చూసి ఓ నమస్కారం చేసి ఊరుకున్నాడు.

"సరే, భగవంతుణ్ణే అడుగుదాం పద!" అంటూ కనకమ్మ తన మొగుణ్ణి వీధి మొగదల ఉన్న గుడికి ఈడ్చుకు పోయింది. గుళ్ళో పూజారి లేడు. గర్భ గుడిలో దీపం వెలుగుతున్నది.

మొగుడి రెక్క పుచ్చుకుని కనకమ్మ తిన్నగా గర్భగుడిలోకి వచ్చేసి, "ఏమయ్యా, దేవుడా! మొగుడు సంపాదించిన డబ్బు పెళ్ళాం ఖర్చు చేస్తే తప్పా? నువే న్యాయం చెప్పు! ఈ మొగుడు నాకు కానీ ఇయ్యడు, కాస్త బుద్ధిచెప్పు," అన్నది.

దేవుడు జవాబు చెప్పలేదు.

"చూడు దేవుడూ! భార్య అయితే మాత్రం, నా డబ్బు ఖర్చు చేసే హక్కు దానికెక్కడ ఉన్నది? తిండికి ఇస్తూనే ఉంటిని గద. దాని చేతిలో ఎంత డబ్బూ నిలవదు. అందుచేత ఇవ్వటం లేదు," అని కనకయ్య దేవుడికి తన గొడవ చెప్పుకున్నాడు.

ఈ లోపలనే తిరిగి వచ్చిన పూజారి సంగతి అంతా గ్రహించి, "గర్భగుడిలో మీ రచ్చ ఏమిటి? నడవండి, నడవండి! గుడి మూసేవేళ అయింది. మీకు తీర్పు చెప్పటానికి దేవుణ్ణి కాస్త ఆలోచించుకో నియ్యండి." అని ఇద్దరినీ బయటికి తరిమాడు.

తమకు కావలిసిన తీర్పు దొరకనందు వల్ల భార్యా భర్తలు వీధిలోకి వచ్చి మళ్ళీ ఘర్షణ ప్రారంభించారు. నలుగురూ చేరి, "మీ ఇంట్లో మీరు దెబ్బలాడు కోండి గాని, ఇలా వీధినపడి అల్లరి చెయ్యటం అందరికీ అసౌకర్యం." అని చెప్పి వాళ్ళను వాళ్ళ ఇంటికి ఈడ్చుకుపోయారు.

ఇంటి లోపలికి వస్తూనే భార్యాభర్త లిద్దరూ నోళ్ళు వెళ్ళబెట్టారు. ఇనప్పెట్టె తెరిచి ఉన్నది. ఎవరో దాన్ని బద్దలు కొట్టి, అందులో ఉన్నదంతా ఊడ్చుకుపోయారు!





# ప్రాప్తం

ఒక గ్రామంలో అమరయ్య అనే పేద రైతు ఉండేవాడు. అతనికి తొలిచూలు ఒక గుడ్డి ఆడపిల్ల పుట్టింది. అమరయ్య దంపతులు తమ ప్రారబ్ధానికి ఎంతో కుమిలి పోయారు. వాళ్ళు ఆ బిడ్డకు మల్లమ్మ అని పేరు పెట్టుకుని పెంచసాగారు.

మల్లమ్మకు పన్నెండేళ్ళు వచ్చేసరికి అమరయ్య సంతానం ఆరుగురు అయారు. సంసారభారం అమరయ్యకు భరించరాని దయింది. గుడ్డిదైన మల్లమ్మ ఏ పనీ చెయ్యలేదు.

ఒకనాడు అమరయ్యా, అతని భార్యా ఇలా అనుకున్నారు :

"మనకు రోజులు గడవటం చాలా ఇబ్బందిగా ఉన్నది. ఈ గుడ్డిదాన్ని పెంచి, పెద్దచేసి ప్రయోజన మేమిటి? పెద్ద దయాక దానికి పెళ్ళికాదు. అది మనకు రొమ్ముల కుంపటి అయి కూర్చుంటుంది. దాన్ని ఎక్కడైనా వదిలేస్తే దాని ప్రాప్తం ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఏ దయామయులైనా చేరదీయవచ్చు. శక్తికి మించిన భారాన్ని దైవానికి వదలటం మేలు."

మర్నాడు అమరయ్య మల్లమ్మను వెంట బెట్టుకుని బయలుదేరాడు. దారి పొడుగునా అతన్ని బాధ దహిస్తూనే ఉన్నది.

ఆ సాయంకాలానికి వాళ్ళు ఒక గ్రామం చేరారు. ఆ గ్రామం పక్కగా ఒక వాగు న్నది. వర్షాకాలంలో తప్ప ఆ వాగులో నీరు ఉండదు. ఈ సమయంలో నదిలో నీరు లేదు. అమరయ్య మల్లమ్మతో సహా ఆ వాగులోకి దిగి అక్కడ కూర్చుని, తాను కట్టుకొచ్చిన సద్దిమూట విప్పి, మల్లమ్మకు తినిపించాడు. తరవాత తాను తిన్నాడు. కొద్ది దూరంలో ఒక చలమ ఉంటే అందులో తాను నీరు తాగి, మల్లమ్మ చేత తాగించాడు.

వై. యస్. రాజేశ్వరి

ఆ రాత్రి వాళ్ళిద్దరూ ఆ వాగు లోనే పడుకున్నారు. చల్లగాలికి ఇద్దరూ సుఖంగా నిద్రపోయారు.

తెల్లవారగానే లేచి అమరయ్య మల్లమ్మ కేసి చూశాడు. ఆ పిల్ల నిశ్చింతగా నిద్ర పోతున్నది. అమరయ్య కళ్ళలో నీళ్ళు నిలిచాయి. అతను మల్లమ్మను ముద్దు పెట్టుకుని గబగబా తన గ్రామం కేసి నడిచి పోయాడు.

కొంత సేపటికి మల్లమ్మ మేలుకుని, లేచి కూచుని, "నాన్నా!" అని పిలిచింది. తన తండ్రి తనను వదిలి పారిపోయాడని ఆమెకు తట్టను కూడాలేదు. ఆమె రెండు, మూడు సార్లు తండ్రిని పిలిచి, సమాధానం రాకపోయే సరికి, తనకు తిండి తీసుకు రావటానికి వెళ్ళి ఉంటాడనుకున్నది.

ఆమె నిశ్చింతంగా ఆ వాగు ఇసుకలో తడివి, కొన్ని రాళ్ళు ఏరుకుని తన లంగాలో వేసుకున్నది; తరవాత వాటిలో నుంచి తనకు కావలసినవి అయిదు రాళ్ళు ఉంచుకుని, మిగిలినవి పారేసింది; ఆ అయిదు రాళ్ళతోనూ ఆమె గచ్చకాయలు ఆడుకోసాగింది. జనం వాగు మీదుగా అటూ ఇటూ పోతున్నారు గాని, మల్లమ్మను గురించి ఎవరూ పట్టించుకోలేదు.

కూతురికి దూరం పోతున్న కొద్దీ అమరయ్య గుండె బరువెక్కుతున్నది. "పాపం, ఏం చేస్తున్నదో? ఏడుస్తున్నదా? ఎవరైనా ఎత్తుకు పోయారా? అమాయకురాలు! ఏ పాపమూ ఎరుగదు! ఆరుగురు పిల్లలలో ఒకతె నాకు భారమయిందా?"

ఇలా అనుకుంటూ అమరయ్య ముందుకు కాలు వెయ్యలేక ఆగిపోయాడు. అతను గబగబా నడుచుకుంటూ మల్లమ్మ ఉన్న చోటికి వచ్చి, ఆ పిల్ల గచ్చకాయలాట చూసి దిగ్భ్రమ చెందాడు. ఆమె ఆడే అయిదు రాళ్ళలో ఒకటి మామూలు రాయికాదు, వజ్రం! ధగధగా మెరుస్తున్నది.

అమరయ్య హృదయం అనందంతో పొంగిపోయింది. "అమ్మా, మల్లమ్మా!" అంటూ కూతుర్ని ఎత్తుకుని, ముద్దు పెట్టుకుని, ఇంటికి తీసుకుపోయాడు.





# యక్షపర్వతం

## 13

[సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ ఎలుగుబంటు ముఠావాళ్ళు తమ బిలదుర్గంలోకి తీసుకుపోయారు. ఖడ్గ జీవదత్తులు పొగలేస్తున్న ప్రదేశాన్ని చేరి, అది బిలదుర్గం అని గుర్తించి, లోపలికి వెళ్ళారు. అక్కడ వాళ్ళను గురుభల్లూకుడి మనుషులు పట్టుకుని, ఒక సొరంగమార్గం వెంట తోడేళ్ళబండ దగ్గిరకు తీసుకుపోసాగారు. తరవాత—]

చీకటి మయంగా వున్న సొరంగ మార్గంలో ఎలుగ్గొడ్డు వాళ్ళు కొంత దూరం ఖడ్గ జీవదత్తులను నడిపించుకు పోయి, ఒక చోట ఆగారు. ముందున్న ఎలుగ్గొడ్డు వాడు తన తోటివాడితో, "ఒరే, అన్నా! ఈ బందీలిద్దరూ తోడేలు బండ అంటే ఏదో వినోదస్థలం అనుకుంటున్నట్టున్నది. లోగడ మనం పట్టుకు వచ్చిన వాళ్ళు తోడేళ్ళ అరుపులు వింటూనే గజ గజ లాడిపోయే వాళ్ళు. వీళ్ళకు యింతవరకూ చీమ కుట్టినట్టన్నా లేదు. ఆ తోడేళ్ళ బండ ఏమిటో, ఎంత భయంకరమైనదో వీళ్ళకు కాస్త చూపిద్దామా?" అన్నాడు.

ఆ మాటలకు రెండవ ఎలుగుబంటు భటుడు విసుక్కుంటూ, "ఇక్కడ అనవసరంగా సమయం వృథా చెయ్యటం ఎందుకు? ఎలాగూ ఈ ఇద్దరూ అక్కడికే పోతున్నారుగదా?" అన్నాడు.



"అలాకాదులే. ముందు ఆ భయంకర ప్రదేశం దర్శనం చేయిస్తే వీళ్ళకు వణుకు పుట్టుతుంది. తరవాత ఆ బండ ఎక్కుద్దాం," అంటూ మొదటి ఎలుగుబంటు వాడు చేతులెత్తి, చీకట్లో కొద్ది సేపు గుహ పైభాగాన్ని తడివి చూసి, ఏదో కొక్కెంలాంటి దాన్ని పట్టుకుని బలంగా లాగాడు. వెంటనే అక్కడ అమర్చివున్న చిన్నతలుపు ఒకటి తెరుచుకుని, సొరంగంలోకి వెన్నెల వెలుగు వెల్లువలా వచ్చి పడింది.

ఆ వెలుగులో ఖడ్గ జీవదత్తులు సొరంగ మార్గాన్ని పరీక్షగా చూశారు. అది చాలా ఎత్తూ, విశాలమూ అయిన పెద్ద సొరంగం. దానిలో సూటిగా పోయే మార్గం ఒక్కటే కాక. కుడి ఎడమల వైపునకూడా కొన్ని మార్గాలున్నవి.

"ఖడ్గా, ఇది మనం అనుకున్నట్టు ఏదో చిన్న బిలం కాదు. ఇందులో యీ ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళు అవసరం అయితే బయటి ప్రపంచానికి తెలియకుండా బతికేందుకు వీలుగా ఒక గ్రామాన్నే నిర్మించినట్టుంది," అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు యిలా అనగానే ఎలుగ్గొడ్డు ముఠావాడొకడు పెద్దగా నవ్వి, "ఆహాఁ, ఎంతబాగా గ్రహించావయ్యా! ఈ బిలంలో మనుషులు నివసించేందుకు గదులేకాక, ఆహార పదార్థాలు నిలవవుంచేందుకు కొట్టాలు కూడా వున్నవి. ఏదో విధంగా మీ ఇద్దరూ తోడేలు బండ దగ్గిర్నుంచి వారం రోజుల్లో తిరిగి యీ సొరంగాన్ని చేరగలిగితే, మీ జీవితాలు గురుభల్లూకుడి సేవలో హాయిగా గడిచిపోతాయి," అన్నాడు.

"అదే మేమూ కోరుకుంటున్నాం," అని జీవదత్తుడు నవ్వి, "ఏదీ, ఆ తోడేలు బండ ప్రదేశం ఎంత భయంకరంగా వున్నదో మమ్మల్ని చూడనీ," అన్నాడు ఎలుగ్గొడ్డు భటుడితో.

ఎలుగ్గొడ్డు భటుడు తెరుచుకున్న తలుపు దగ్గిర్నుంచి యివతలికి వచ్చాడు. ఖడ్గ జీవదత్తులు అక్కడ ఎత్తుగా వున్న ఒక రాతి మీద కాళ్ళానించి బయిటికి చూశారు.

వెన్నెల కాంతిలో ఎలుగ్గొడ్డుముఠా భటులు చెప్పినట్టు తోడేలు బండ భయంకరంగానే వున్నది. విశాలంగా వున్న ఒక సమతల ప్రదేశం మధ్య పన్నెండూ పదిహేనడుగుల ఎత్తున ఒక రాతి బండ వున్నది. దాని మీద ఇద్దరు మనుషులు ఈటెలు పట్టుకుని, కింది నుంచి తమ కేసి ఎగురుతున్న తోడేళ్ళను అదిలిస్తున్నారు. బాగా ఆకలి గొన్న తోడేళ్ళు వాళ్ళను చంపి తినేందుకు భీకరంగా అరుస్తూ, బండ చుట్టూ గిరికీలు కొడుతున్నవి.

"ధరించిన దుస్తుల తీరును బట్టి బండ మీద వున్న వాళ్ళిద్దర్లో ఒకడు సమర బాహులా కనబడుతున్నాడు!" అన్నాడు జీవదత్తుడు.

"ఏ బాహైూ గాని వాడూ వాడి అను చరుడూ నాలుగైదు గంటల్లో తోడేళ్ళకు ఆహారమైపోతారు. మీరూ ఆ బండ మీదికే పోతున్నారు గనక మీకూ ఆ గతే పట్టుతుంది. కాని, వృకేశ్వరీదేవి కరుణ వల్ల మీరు బతికి రాగలిగారో, ఆ తరవాత గురు భల్లూకుడి సేవలో....."

ఎలుగ్గొడ్డు భటుడు మాట ముగించే లోపలే జీవదత్తుడు వాణ్ణి గట్టిగా కసురుతూ, "ఊరికే వసపిట్టలా ఆ గురుస్తోత్రం చెయ్యకు. మేం యిక్కణ్ణించే ఆ బండ దగ్గిరకు పోవాలి గదా? అలాగే వెళతాం. ఇక మీ దారిన మీరు వెళ్ళండి." అన్నాడు.

"ఆహాఁ, ఎంత సాహసం! ఇక్కణ్ణించి తోడేలు బండ ప్రదేశానికి చేరాలంటే





"కానీయండి, యీ కాలక్షేపం కబుర్లన్నీ ఎందుకు?" అన్నాడు జీవదత్తుడు. అతడికి తాము బండ మీదికి చేరేలోపలే తోడేళ్ళ నుంచి సమరబాహుకు ప్రమాదం కలగ వచ్చునన్న భయం కలిగింది. అలా జరిగితే యిన్ని శ్రమలకోర్చి తాము యీ బిలంలో ప్రవేశించటం వృథా ప్రయాస అయి పూరు కుంటుంది.

ఎలుగ్గొడ్డుభటు లిద్దరూ సొరంగం పైన తెరిచిన తలుపును యథా ప్రకారం మూసి వేసి, సొరంగంలో మరి కొంచెం దూరం ముందుకు పోయి, అక్కడ భూమి మీది నుంచి పైకి వున్న మెట్లు ఎక్కించి, ఖడ్గ జీవదత్తుల్ని కొంతదూరం తీసుకుపోయారు. అక్కడ వాళ్ళకొక నలుచదరపు రాతిపలక కనిపించింది. భటులు ఆ పలకలో బిగించి వున్న ఇనప కమ్మిని పట్టుకుని బలంగా కిందికి లాగారు. పలక పక్కకు జరిగి బండ మీద వున్న సమరబాహూ, అతడి అను చరుడూ ఖడ్గ జీవదత్తులకు కనిపించారు.

ద్వారం అవతల పదడుగుల ఎత్తు నుంచి నేల మీదికి గెంతాలి. ఆ తరవాత తోడేళ్ళ మధ్యగా నడుస్తూ పోయి బండ మీది కెక్కాలి. ఈ లోపలే మిమ్మల్నవి చీల్చి చెండాడి పొట్టన పెట్టుకుంటవి!" అన్నా డొక ఎలుగ్గొడ్డు భటుడు.

"సరే, మమ్మల్నక్కడికి ఎలా చేర్చదలిచారు?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"అక్కడికి పోయేందుకు మరొక చిన్న సొరంగమార్గం వుంది. ఆ మార్గం మిమ్మల్ని తోడేలుబండ లోపల వున్న ఒక రాతి తలుపు వద్దకు చేర్చుతుంది. మిమ్మల్ని ఆ దారి వెంట బండ మీదికి చేర్చుతాం," అన్నారు ఎలుగ్గొడ్డు భటులు.

రాతిపలక పక్కకు జరిగేప్పుడయిన శబ్దం వింటూనే సమరబాహు, ఎగిరి ఒక గంతు వేసి, "అరే, చందూ! రాతిబండ పొట్ట లోంచి తోడేళ్ళు పైకొస్తున్నవి!" అంటూ అరిచాడు.

ఖడ్గ జీవదత్తులు బండ పైకెక్కుతూ, "మేం తోడేళ్ళం కాదు, నీ లాంటి మనుష



లమే. భయపడకు సమరబాహూ! నీ మిత్రులం," అన్నారు.

ఖడ్గ జీవదత్తుల్ని చూసి సమరబాహు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతడు ఏమో అనబోయాడు గాని గొంతు పెగలలేదు. ఇంతలో ఎలుగ్గొడ్డు భటులు రాతిపలకను పైకెత్తి కంతను మూసేస్తూ, "మీరందరూ మిత్రులేనా? అయితే తోడేళ్ల మందకు కలిసి కట్టుగా విందు భోజనం కండి," అన్నారు.

ఖడ్గవర్మ కోపంగా వాళ్ళ కేసి తల తిప్పేంతలో రాతిపలక దభీమంటూ గట్టిగా మూసుకుపోయింది. జీవదత్తుడు, సమరబాహు భుజం తట్టి ధైర్యం చెబుతూ, "సమరబాహూ, భయపడకు. స్వర్ణాచారి ద్వారా సంగతంతా విన్నాం. అతడు మాకు పాత మిత్రుడు. మనం అందరం సురక్షితంగా ఈ తోడేళ్ళబండ మీది నుంచి మన నివాసప్రాంతాలు చేరగలం. నా మాట నమ్ము," అన్నాడు.

"మనం ప్రాణాలతో యిక్కణ్ణించి బయటపడగలమా? అదెలా సాధ్యమవుతుంది? ఈ బండ పొట్టలోంచి సొరంగంలోకి ఉన్న ద్వారాన్ని ఆ దుష్టులు మూసేశారు. బండ దిగి పోవాలంటే చుట్టూ ఆకలిగొన్న తోడేళ్ళు!" అన్నాడు సమరబాహు నిస్పృహగా.

"ఆ తోడేళ్ళూ, వాటికి తాము బందీలుగా పట్టుకు వచ్చిన మనుషుల్ని మేపే ఎలుగ్గొడ్డువాళ్ళూ కూడా మనకు దారి యిస్తారు. మనం భూమిలోవున్న బిలంలో ప్రవేసించి, యిప్పుడు చుట్టూ కోటగోడల్లావున్న గుట్టల్లోని రాతి ప్రదేశం మధ్య—ఈ బండ మీదికి చేరాం. పైన చంద్రుడు కనిపిస్తున్నాడు గదా? అంటే, ఆ దుర్మార్గులు నివసిస్తున్న బిలానికీ, ఈ ప్రదేశానికీ మధ్య వచ్చి పోయేందుకు ఒకటి రెండు తలుపులూ, ద్వారబంధాలూ మాత్రమే వున్నవి!" అన్నాడు జీవదత్తుడు.

"మీరు చెప్పింది నిజమే. అయినా మనం యీ తోడేళ్ళనూ, గురుభల్లూకుడి



భటులనూ తప్పించుకుని ఎలా పారిపో గలమో నా కర్థం కావటం లేదు." అన్నాడు సమరబాహు.

జీవదత్తుడు మరేదో చెప్పబోయేంతలో బాగా ఆకలిగొన్న తోడే లొకటి కుప్పించి పైకెగిరి, రాతిబండలో వున్న పగుళ్ళలో ఒక చోట ముందుకాళ్ళతో బలంగా పట్టుకుని, బండపైకి పాకాలని చూసింది. ఖడ్గవర్మ చప్పున ముందుకు వంగి కత్తితో దాని తల మీద బలంగా కొట్టి, మెడ పట్టుకుని పైకి లాగి బండ మీద పడవేశాడు.

"ఖడ్గా, చాలా మంచి పనిచేశావు!" అని జీవదత్తుడు ఖడ్గవర్మను మెచ్చుకుని, "ఈ చచ్చిన తోడేలుతో మనకు పనిపడుతుంది. సమరబాహూ! ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు యీ తోడేళ్ళకు ఆహారం ఏ సమయాల్లో వేస్తారో నీకు తెలుసా?" అన్నాడు.

"ఆ దుర్మార్గులు మాట్టాడుకుంటూండగా విన్నాను. ఈ క్రూరమృగాలకు వాళ్ళు సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాల్లో ఏ జంతు మాంసమో తెచ్చి వేస్తారు. కాని వాళ్ళకు ఆ శ్రమలేకుండా యివి యీలోపలే మనను పీక్కుతిన్నా తినవచ్చు." అన్నాడు సమరబాహు.

"ఖడ్గా, ముందు మనం చూసిన సొరంగంలోని ద్వారం కుండా వాళ్ళు తోడేళ్ళకు ఆహారం వేస్తారనుకుంటాను?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ దూరంగా భూమికి పది అడుగుల ఎత్తులో గోడకు బిగించి వున్న తలుపు కేసి చూసి, "తోడేళ్ళను మేపటానికి అదొక్కటే మార్గంలా కనిపిస్తున్నది. నీ ఆలోచన ఏమిటి? ఏమైనా మంచి పథకం వేయబోతున్నావా?" అని అడిగాడు.

"తోడేళ్ళ బండ మీది నుంచి తమ బందీ అయిన వాడెవడూ బతికి బయట పడలేడన్న ధీమాతో గురుభల్లూకుడు మనను ఆయుధాలతోనే యిక్కడ వదిలాడు. ఇదే వాడికీ, వాడి శిష్యగణానికీ ప్రమాద కారణం కాబోతున్నది." అన్నాడు జీవదత్తుడు చుట్టూ కలయచూస్తూ.

ఆ తరవాత వాళ్ళ మధ్య అంతగా సంభాషణ జరగలేదు. బాగా పొద్దు పోవటంతో ఒకరు మేల్కొని వుండి, తోడేళ్ళ నుంచి ప్రమాదం రాకుండా కావిలి కాస్తూండగా తతిమ్మా వాళ్ళు బండ మీద పడుకుని నిద్రపోయారు.

సూర్యోదయం అవుతూండగా బండ చుట్టూ వున్న తోడేళ్ళు భీకరంగా అరుస్తూ సొరంగ మార్గం వైపున వున్న ద్వారం కింద తచ్చాడసాగినై. వాటి అరుపులకు అందరూ మేల్కొన్నారు. జీవదత్తుడు ఖడ్గవర్మకు ద్వారాన్ని చూపుతూ, "మన ఊహ సరైనదే! ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళు అక్కడ వున్న తలుపు తెరిచి తోడేళ్ళకు అందులో నుంచి యువతలికి ఆహారం విసరబోతున్నా రన్న మాట! ఏదీ, నీ విల్లంబులు బయిటికి తీసి, ఆ ద్వారానికి గురిచేసి వుంచు," అన్నాడు.

జీవదత్తుడు చెప్పినట్టే ఖడ్గవర్మ బాణాన్ని ఎక్కుపెట్టి బండ మీద తాపీగా కూర్చున్నాడు. సమరబాహు అది చూసి భయపడిపోతూ, "అయ్యా, మనం ఆ దుర్మార్గుల్లో ఒక రిద్దరిని చంపి ప్రయోజనం ఏమిటి? మిగతా వాళ్ళు మరింతగా రెచ్చిపోయి మనను ఘోర దుర్మరణం పాలు చెయ్యరా?" అన్నాడు.

సమరబాహు మాటలకు జీవదత్తుడు నవ్వుతూ, "సమరబాహూ! ఇప్పుడు మనను ఆ దుష్టులు తోడేళ్ళ బండ మీద ఎక్కించి దుర్మరణం పాలు చేయాలనే గదా చూస్తు



న్నది! తోడేళ్ళ నోట పడి శరీరంలోని కండ కండా పీకించుకుని చావటంకన్న భయం కర మరణం ఏమున్నది?" అన్నాడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే సారంగ మార్గం పైనున్న తలుపు కిర్రు మంటూ తెరుచుకున్నది. ఇద్దరు ఎలుగ్గొడ్డు వాళ్ళు జంతు మాంసంతో నిండి వున్న పెద్ద తట్ట నొకదాన్ని పైకెత్తి, మాంసాన్ని బయిటికి వేయబోతున్నారు. అదే సమ యంలో జీవదత్తుడు హెచ్చరించగానే ఖడ్గవర్మ గురిచూసి వదిలిన బాణం రివ్వు మంటూ పోయి, ఎలుగ్గొడ్డు భటుల్లో ఒకడి నొసల మధ్య తపీమంటూ బలంగా తగి లింది. వాడు ఒక చావుకేక పెట్టి వెనక్కు విరుచుకు పడిపోయాడు. వాడితో పాటు రెండవ భటుడూ, మాంసం తట్టా కూడా సారంగ మార్గంలో దభీమంటూ పడి పోయినై.

బిలంలో కలకలం లేచింది. వృకేశ్వరీ దేవి ముందు పద్మాసనం వేసుకుక్కూర్చుని ధ్యానముద్రలో వున్న గురుభల్లూకుడికి ధ్యాన భంగం అయింది. అతడు కోపంగా లేచి నిలబడి, "ఏమిటా గంద్రగోళం? తోడేళ్ళబండ దగ్గిర ఆ అరుపులేమిటి? వాటి కింకా ఆహారం వెయ్యలేదా? లేక నిన్న దొరికిన బందీలనవి పట్టుకు తింటున్నవా?" అని, అప్పుడే అక్కడికి పరిగెత్తుకొచ్చిన ఒక ఎలుగ్గొడ్డు భటుణ్ణి కోపంగా ప్రశ్నించాడు.

"గురుభల్లూకా! ప్రమాదం జరిగింది. తోడేళ్ళ బండపై నున్న బందీల్లో ఒకడు మన వాణ్ణి బాణంకొట్టి చంపాడు. వాడి దగ్గిర మరికొన్ని బాణాలు కూడా వున్నవి. ఇప్పుడేం చేయటం?" అన్నాడు ఎలుగ్గొడ్డు భటుడు.

గురుభల్లూకుడు కళ్ళెర్రచేసి, ముక్కు పుటాలు అదురుతూండగా, "వృకేశ్వరీదేవి ప్రియ భక్తుణ్ణయిన నా శక్తి సామర్థ్యాల ముందు, ఆ అల్ప మానవులేపాటి! ఇప్పుడే వాళ్ళనందర్నీ నా పంచశూలానికి ఆహుతి చేయబోతున్నాను," అంటూ సారంగ మార్గం కేసి బయలుదేరాడు.

—(ఇంకావుంది)





# ఊహించని ఫలితం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నాన్ని నేను మెచ్చుకుంటాను కాని, ఒక్కొక్కప్పుడు ప్రయత్నం వల్ల సాధ్యం కాని పనులు దైవికంగా వాటంతట అవే సిద్ధించటం జరుగుతుంది. అందుకు నిదర్శనంగా నీకు కేకయరాజు ఉపాహారవర్మ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కేకయదేశాన్ని పాలించిన ఉపాహారవర్మ మహా బలసంపన్నుడు. ఆయన వద్ద గొప్ప సేన ఉండేది. అంతులేని ధనసంపద ఉండేది. అందుచేత ఇరుగు పొరుగు రాజులు కేకయదేశాన్ని కన్నెత్తి చూడ వెరిచేవారు. ప్రజలు కూడా ఉపా

## బేతాళ కథలు



హారవర్మ వంటి మహాప్రభువు తమకు ఉన్నందుకు చాలా గర్వపడేవారు. ఉపాహారవర్మ ఎలాంటి శత్రుభయమూ ఎరగక ఎంతో గర్విష్ఠిగానూ, నిర్లక్ష్యంగానూ ఉండేవాడు.

ఒకసారి కేకయదేశపు దక్షిణ ప్రాంతంలో ఒక పితూరీ లేచింది. అక్కడ ఉండిన బలవంతులు కొందరు తిరుగుబాటు చేసి, అరాజకం కలిగించారు. ఈ వార్త తెలియగానే ఉపాహారవర్మ తగిన చర్య తీసుకోక, తిరుగుబాటుదార్లు రాజద్రోహం తలపెట్టినట్టయితే వారిని తీవ్రంగా శిక్షిస్తానని తన అధికార్ల-చేత ప్రకటన చేయించి, ఆ తిరుగుబాటును గురించి పట్టించుకోలేదు.

మరికొంత కాలానికి రాజుకు మరింత దారుణ వార్త అందింది: తిరుగుబాటుదార్లు పెద్ద సేనను పోగుచేసుకుని రాజధాని మీదికి వస్తున్నారు. అప్పటికీ ఉపాహారవర్మ చలించలేదు. తన సేనలు ఎలాటి సేనలనైనా నిర్మూలించగలవని ఆయనకు తెలుసును. అందుచేత, తిరుగుబాటుదార్లు తన సేనలతో పోరాటానికి దిగి, అగ్ని మీదికి వచ్చిన మిడతలదండు లాగా నాశనమై పోతారని ఆయన అనుకున్నాడు.

కాని అలా జరగలేదు. యుద్ధరంగంలో ఏమి జరిగినదీ కూడా ఆయన ఎరగడు. రాజుగారి సేనలు చిందరవందర అయాయనీ, అనేకమంది సైనికులు శత్రువు చేతిలో చచ్చారనీ, కొందరు తిరుగుబాటు సేనలో చేరిపోయారనీ, మిగిలినవాళ్ళు పారిపోయారనీ, తిరుగుబాటు నాయకుడు రాజసౌధానికి వస్తున్నాడనీ తెలిసింది.

ఎవరికీ ఎన్నడూ లొంగని ఉపాహారవర్మ కొంత ధనమూ, కొద్ది పరివారమూ వెంటబెట్టుకుని రహస్యమార్గం గుండా రాజభవనం నుంచి ప్రాణాలతో పారిపోవలసి వచ్చింది. ఆ రోజే తిరుగుబాటు నాయకుడు రాజభవనం ప్రవేశించి, కేకయ దేశానికి కొత్త రాజుగా అభిషేకం పొందాడు.

శత్రువులు ఈ విజయోత్సవంలో ఉండగా ఉపాహారవర్మ తన అనుచరులతో సహా

చప్పున చంద్రభాగానదిని దాటి మద్ర దేశంలో ప్రవేశించి, తన మిత్రుడైన మద్ర రాజును ఆశ్రయించాడు.

మద్రరాజు ఉపాహారవర్మ పట్ల ఎంతో సానుభూతి చూపి, "జరిగిన దానికి విచారించకండి. జయాపజయాలు దైవికమైనవి. మీకు అన్నివిధాలా నేను తోడ్పడతాను. నా సేనలను తీసుకుపోయి మీ శత్రువును హతమార్చి, తిరిగి మీ రాజ్యం మీరు ఏలుకోండి," అన్నాడు.

ఉపాహారవర్మకు ఆత్మవిశ్వాసం తిరిగి వచ్చింది. ఈ సారి తనకు నిశ్చయంగా విజయం లభిస్తుందన్న నమ్మకంతో ఆయన మద్ర సేనలను వెంటబెట్టుకుని కొత్త కేకయ రాజు పైకి యుద్ధానికి వెళ్ళాడు. చంద్రభాగా నదీ తీరానే యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో మద్రసేనలు చిత్తుగా ఓడిపోయాయి. ఉపాహారవర్మ తన గుర్రాన్ని కూడా పోగొట్టుకుని, ఎలాగో శత్రురాజుకు చిక్కకుండా తప్పించుకుని, ప్రాణాలు మాత్రం దక్కించుకుని, అరణ్యమార్గాన బయలుదేరాడు.

ఆయన కిప్పుడు ఏమీ మిగలలేదు. సర్వనాశనం అయింది. గర్వం పూర్తిగా నశించింది. తాను ఎలాగో పొట్టపోసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆయన చాలా రోజులు ప్రయాణించి బ్రహ్మవర్తం చేరాడు. అప్పటది చాలా చిన్న రాజ్యం. ఆ రాజు ఉపాహారవర్మతో పోల్చితే చాలా అల్పుడు. అయినప్పటికీ ఉపాహారవర్మ ఆయన వద్దకు వెళ్ళి, తాను ఎవరైనదీ చెప్పక, "మహారాజా, నేను పెద్ద పెద్ద సేనలకు ఆధిపత్యం వహించిన వాణ్ణి. నన్ను తమ సేనాపతిగా పెట్టుకోండి," అన్నాడు.



బ్రహ్మదత్తరాజు అభ్యంతరం చెప్పలేదు.

కొంతకాలం గడచింది. సింధుసేనలు బ్రహ్మదత్తదేశం మీదుగా జైత్రయాత్ర వెళ్ళుతూ, బ్రహ్మదత్తం లోని గ్రామాలను కొల్లగొట్టసాగాయి.

"మనం సింధు సేనలతో యుద్ధం చేద్దాం. చూస్తూ వూరుకుంటే వాళ్ళు రాజ



థాని మీదికే రావచ్చు." అన్నాడు బ్రహ్మదత్త రాజు ఉపాహరవర్మతో.

ఉపాహరవర్మ నిర్ఘాంత పోయాడు. బ్రహ్మదత్త సేనలతో పోల్చితే సింధు సేనలు చాలా పెద్దవి. ఈ యుద్ధంలో తాను మరొక అపజయం చవిచూడబోతున్నాననుకున్నాడు ఉపాహరవర్మ.

బ్రహ్మదత్త రాజు సేనలకు తానే ముందుండి, సైనికులను ఉత్సాహపరిచి యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధం చాలా శీఘ్రంగా ముగిసింది. సింధు సైనికులు అంతలోనే తమ మీద అంతదారుణమైన దాడి జరుగుతుందని కలలో కూడా అనుకో లేదు. బ్రహ్మదత్త సైనికులు వారిపై పిడుగులు పడ్డట్టు పడి, పారిపోలేని వారిని వధ చేసి, వారి గుడారాలకు నిప్పు పెట్టి, మహా భీభత్సం చేశారు. సింధు సైనికుల జైత్ర యాత్ర అక్కడే ముగిసింది.

కొద్ది గంటల అనంతరం బ్రహ్మదత్త రాజు విజయోత్సాహంతో రాజధానికి తిరిగి వచ్చేటప్పుడు ఉపాహరవర్మ, "మహారాజా, కొద్ది మంది మన సైనికులు అంత పెద్ద సైనిక శిబిరాన్ని అవలీలగా మట్టుబెట్టడం ఆశ్చర్యం కాదా? ఇలా జరగటం నాకు పూర్వం అనుభవమే. నేను మీ వద్ద ప్రచ్ఛన్నంగా ఉంటున్న కేకయరాజును. నా సేనలో సగం కూడా లేని తిరుగుబాటు సైనికులు నన్ను ఓడించి రాజ్యభ్రష్టుణ్ణి చేశారు. నిజానికి ఆ యుద్ధంలో నేను పాల్గొన లేదు. కాని అదే ఇప్పుడు కళ్ళారా చూశాను," అన్నాడు.

బ్రహ్మదత్త రాజు నవ్వి, "యుద్ధంలో విజయం సంఖ్య మీద అంతగా ఆధార పడదు; సైనికుల విజయ కాంక్షపై ఎక్కువ ఆధారపడుతుంది," అన్నాడు.

తాను ఎవరో బయటపెట్టిన అనంతరం ఉపాహరవర్మకు బ్రహ్మదత్త రాజు వద్ద కొలువు చెయ్యబుద్ధిపుట్టలేదు. అదీ కాక అతనికి తన దేశం మీద మనసు పోయింది. తనకిక గొప్ప భవిష్యత్తు లేదు. పొట్ట పోసుకునేటందుకు అజ్ఞాతంగా దేశాంత

రాలలో ఉండేకన్న, ఏదో మారుపేరు పెట్టుకుని తన దేశంలోనే ఉండవచ్చు.

ఈ ఉద్దేశంతో ఉపాహారవర్మ తన దేశానికి బయలు దేరాడు. అయన చంద్రభాగా నదిని దాటి కేకయ సరిహద్దులో అడుగు పెట్టగానే కొందరు రాజభటులు అయనను సమీపించి, "ఎవరు నువు?" అని అడిగారు.

"నేను ఎవరైతే మీకేమిటి?" అని ఉపాహారవర్మ ఎదురు ప్రశ్న వేశాడు.

"మా రాజుగారు కొత్తగా వచ్చే వారిపై నిఘా ఉంచుతున్నారు," అని ఒక భటుడు జవాబు చెప్పాడు.

"మీ రాజుకు కొత్తవాళ్ళంటే ఎందుకంత భయం?" అన్నాడు ఉపాహారవర్మ.

"మా రాజు నడమంత్రపు రాజు. తిరుగుబాటుచేసి మా పాతరాజు ఉపాహారవర్మను జయించి రాజయాడు. ఈయనగారికి అయనగారు తిరిగి వచ్చి ఎక్కడ రాజ్యం లాక్కుంటాడో నని బెదురు!" అన్నాడొక భటుడు.

ఇన్ని సంవత్సరాల అనంతరం కూడా ఈ తిరుగుబాటుదారు తనను గురించి ఎందుకు భయపడుతున్నాడో ఉపాహారవర్మ ఊహించలేక పోయాడు.

ఏ మయితే అదే అవుతుందని అతను, "నేనే ఆ ఉపాహారవర్మను. నేను రాజుగా, పెద్ద సేనకు అధిపతిగా ఉండగా నా మీద




కత్తి కట్టినవాడు దిక్కులేని స్థితిలో ఉన్న నన్ను గురించి ఇంత భయపడటం చిత్రంగా ఉన్నది," అన్నాడు.

ఈ మాట వినగానే భటులు ఉపాహారవర్మ కాళ్ళపైన పడి, "తమరిని పోల్చలేదు, మహారాజా! తమరు వెంటనే తిరిగి వెళ్ళి పొండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు." అన్నారు.

"నేను జీవచ్ఛవాన్ని. పోగొట్టుకోవటానికి నాకు ప్రాణాలు తప్ప ఇంకేమీ లేవు. నేను ఈ గడ్డ మీదనే చస్తాను. సరేనా?" అన్నాడు ఉపాహారవర్మ.

భటులు తమలో తాము కూడబలుక్కుని, ఒక భటుడి దుస్తులు అతనికి వేసి,

తమ వెంట తమ బసకు తీసుకుపోయారు. రాజధానిలో ఉపాహారవర్మ కోసం ప్రాణాలివ్వటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు అన్ని తరగతులలోనూ ఉన్నారు. వాళ్ళకు ఆయన తిరిగి వచ్చాడన్న వార్త క్షణాల మీద అందింది. వెంటనే పథకం తయారయింది. రాజమందిరంలోనే తిరుగుబాటు రాజు తన సేవకుల చేతనే హత్య చేయబడ్డాడు. అదే రోజు తిరుగుబాటులో పాల్గొన్న వారంతా కారాగృహంలో బంధించబడ్డారు. మర్నాడు ఉపాహారవర్మ ప్రజల ఆనందోత్సవాల మధ్య తన సింహాసనం మీద తాను తిరిగి కూర్చున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తిరుగుబాటురాజు ఉపాహారవర్మను ఓడించి కూడా ఆయనంటే ఎందుకంతగా భయపడ్డాడు? ఉపాహారవర్మ విశ్వప్రయత్నం చేసి కూడా సాధించని విజయాన్ని ఏమీ చెయ్యకుండా ఎలా సాధించాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఓడిపోయినప్పటికీ ఉపాహారవర్మ అంటే ప్రజలకు అమితమైన అభిమానం ఉండి ఉండాలి. దానికి కొంత కారణం తిరుగుబాటు నాయకుడి దుష్పరిపాలన కూడా కావచ్చు. ఏమైనా, ఉపాహారవర్మకు ప్రజాబలం ఉన్నదని తెలిసే తిరుగుబాటురాజు భయపడ్డాడు. ఆ ప్రజాబలాన్ని సరిగా వినియోగించుకోక ఉపాహారవర్మ రెండుసార్లు అపజయం పొందాడు. అతనికి సైనికబలంలో అమితమైన విశ్వాసం ఉన్నట్టు స్పష్టం. కాని తిరిగి అతనికి రాజ్యం ఇప్పించింది ప్రజాబలం. ఈ సంగతి బ్రహ్మదత్తరాజు నుంచి ఉపాహారవర్మ తెలుసుకుని ఉండవలసింది. కాని తెలుసుకోలేకపోయాడు. బ్రహ్మదత్త సైనికులు శత్రువును సైనికులుగా కన్న ప్రజలుగానే ఎదుర్కొన్నారనటానికి సందేహం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# సోమదేవుడి అదృష్టం

రాజకుమారుడు సోమదేవుడు సముద్రం మీద ప్రయాణం చేస్తూ ఉండగా, నీటి అడుగున ఉన్న శిలకు తగిలి అతని నౌక భగ్నమయింది. సోమదేవుడికి ఒక దుంగ దొరకటం వల్ల అతను దాని మీద పడుకుని, మునగకుండా తేలి ప్రాణాలు కాపాడుకో గలిగాడు. నౌకలోని మిగతా వాళ్ళంతా సముద్రంలో మునిగిపోయారు.

సోమదేవుడు ఆ దుంగ మీద స్పృహ తప్పి రెండు రోజులపాటు సముద్రంలో కొట్టుకు పోయిన మీదట, అతను ఒక విచిత్రమైన దీవి చేరాడు. పెద్ద పెద్ద అలలు అతన్ని సముద్రతీరపు ఇసుక మీదికి తోసివేశాయి.

సూర్యకిరణాల స్పర్శకు సోమదేవుడికి స్పృహ వచ్చింది. అతను కళ్ళు తెరిచి, తాను సముద్రం నుంచి నేలకు చేరు కున్నట్టు గ్రహించాడు. అతని సమీపంలో చిన్న గుట్ట ఉన్నది. అతను నీరసంగా లేచి, అతి ప్రయాసతో ఆ గుట్ట ఎక్కి దిగాడు. అతని కళ్ళకు విస్తీర్ణమైన పొలా లలో ఉర్లగడ్డల పంట కనిపించింది. పంట ఏపుగా పెరిగి పచ్చని ఆకులతో నవ నవ లాడుతున్నది. నీరసంగా ఉండటం చేత అతని తల తిరగనారంభించింది. అతను స్పృహతప్పి ఉర్లగడ్డ మొక్కల మధ్య పడిపోయాడు.

అతనికి మళ్ళీ స్పృహ తెలిసే సరికి అతను ఒక అందమైన గదిలో చక్కని పక్క మీద పడుకుని ఉన్నాడు. ఒక వింత మనిషి, చేతిలో బల్లెం పట్టుకుని, వంగి అతని కేసి చూసి, క్రూరంగా నవ్వాడు.

"నే నెక్కడ ఉన్నాను?" అని సోమ దేవుడు అడిగాడు.

"ఆలూపురం రాజైన పాటూంగా మహా రాజు భవనంలో," అన్నాడు వింతమనిషి.

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



సోమదేవుడు చేతులూ, కాళ్ళూ కద లించ బోయాడు, కాని అవి మంచానికి దృఢంగా బంధించి ఉండటాన కదలలేదు.

"నన్నెందు కిలా బంధించారు?" అని సోమదేవుడు అడిగాడు.

"నిన్ను బందీగా ఉంచమని పాటూంగా మహారాజు అజ్ఞ. నువు మా దేశంలోకి దురాక్రమణ చేశావు. బహిరంగ విచారణ జరిపి, నీకు మరణదండన విధిస్తారు," అన్నాడు భటుడు.

విధివైపరీత్యాన్ని తలుచుకుని సోమ దేవుడు నిట్టూర్చాడు. తాను బయలుదేరి నది మణిద్వీపానికి. మణిద్వీప రాజ కుమార్తెను పెళ్ళాడే ఉద్దేశంతో తాను సపరివారంగా తన దేశం నుంచి నౌకలో ప్రయాణమైనాడు. కాని విధి వక్రించింది. తాను ఒక వింత ద్వీపంలో అనాగరికులకు చిక్కి, నిస్సహాయుడుగా మృత్యువుకు బలి కాబోతున్నాడు! అతని బుర్ర పని చెయ్య లేదు. అతను నిద్రపోయాడు.

భటుడు వచ్చి తనను మంచం నుంచి బంధవిముక్తుణ్ణి చేసేటప్పుడు అతనికి మెలకువ వచ్చింది. ఆ భటుడు అతన్ని రాజభవనం కుండా నడిపించుకుంటూ పోయి కారాగృహాన్ని చేరుకుని, అక్కడ ఇతర భటుల సహాయంతో అతన్ని ఒక గదిలోకి నెట్టాడు.

"నన్ను ఇక్కడికి తెచ్చా వెందుకు?" అని సోమదేవుడు అడిగాడు.

"ఇంతకాలమూ నువు అస్వస్థుడివి. ఇప్పుడు అందరు ఖైదీలవంటి వాడివే," అని జవాబు వచ్చింది.

చీకటి కొట్టుకు తాళంవేసి భటుడు వెళ్ళి పోయాడు. సోమదేవుడు గదిలో కూర్చుని తన దురదృష్టానికి విచారించసాగాడు.

అతని వెనక ఉన్న గోడ మీద ఎవరో తట్టినట్టు వినిపించింది. గోడ వెనక నుంచి ఎవరో ఆ చప్పుడు చేశారు. సోమదేవుడు ఆ గోడ మీద రెండుసార్లు తట్టాడు. వెంటనే అవతలి మనిషి నుంచి జవాబుగా రెండుసార్లు గోడ తట్టిన చప్పుడయింది.



"అవతలి మనిషి ఎవరై ఉంటారా?" అని ఆశ్చర్యపడుతూ, గోడలో ఏదైనా రంధ్రం ఉంటుందేమోనని వెతికాడు, సోమదేవుడు. కాని గోడలో రంధ్రం లేదు.

అతని నడుము పట్టి లోపల ఎప్పుడూ ఒక చిన్న చాకు ఉంటుంది. సోమదేవుడు దానిని పైకి తీసి, గోడలోని ఒక ఇటుక చుట్టూ ఉండే సున్నం గీరి, ఇటుకను ఊడదీశాడు. దానిలో నుంచి తొంగి చూస్తే ఒక అసాధారణ సౌందర్యవతి అతని కంట పడింది. ఆమె దుస్తులూ, కేశాలంకరణా చెదిరి ఉన్నప్పటికీ ఆమె రాజకుమార్తెలాగే కనబడింది.

"మీ రెవరు?" అని సోమదేవుడు ఆమెను అడిగాడు.

"నేను మణిద్వీప రాజకుమార్తెను. మరి మీ రెవరు?" అని ఆమె అడిగింది.

ఆమె జవాబు వినగానే సోమదేవుడి గుండె ఎగిరి గంతేసింది. తాను సముద్ర ప్రయాణం చేసిన మణిద్వీప రాజకుమార్తె హీరావతి ఈమేనన్నమాట!

"నేనా? నేనొక అభాగ్యపు రాజకుమారుణ్ణి. ఓడ పగిలి ఇక్కడ వచ్చి పడ్డాను. ఈ వింత దేశానికి మీరెలా వచ్చారు?" అని సోమదేవుడు ఆమెను అడిగాడు.

"నేను కూడా నౌకాభంగం ద్వారానే ఇక్కడ చేరాను. నేను మా మేనమామ ఉండే దీవికి పోతూండగా సముద్ర మధ్యంలో తుపాను వచ్చి మా ఓడ మునిగి పోయింది. కెరటాలు నన్ని దీవి మీద పడేశాయి. ఈ దేశపు రాజు పాటూంగా ఒంటి కంటివాడూ, గూనివాడూనూ. వాడు నన్ను పెళ్ళాడతానంటే నేను నిరాకరించాను. అందుకని ఇక్కడ బంధించారు. నన్ను ఏం చెయ్యబోతారో తెలీదు గాని, ఆ గూని వాణ్ణి పెళ్ళాడే కన్న చావే నాకు మేలు," అన్నది హీరావతి, కంట నీరు పెడుతూ.

అంతలో అడుగుల సవ్వడి విన వచ్చింది. సోమదేవుడు గోడలోని కంతకు అడ్డంగా కూర్చున్నాడు. భటుడు ఒకడు వచ్చి, అతని గదిలో భోజనం ఉంచి వెళ్ళాడు.



కొంతసేపు గడవనిచ్చి సోమదేవుడు తిరిగి కంతలో నుంచి సంబోధిస్తూ "ఈ దేశం గురించి మీకేమైనా తెలుసునా, రాజ కుమారీ ?" అని అడిగాడు.

"ఈ దేశం వచ్చినాక రాజు నన్ను చాలా మర్యాదగా చూశాడు. నేను స్వేచ్ఛగా ఇష్టం వచ్చిన చోట్లు తిరిగి, ఈ దేశం గురించి అంతా తెలుసుకున్నాను. ఈ దేశపు సంపద అంతా ఉర్లగడ్డే. ఉర్లగడ్డ ఇక్కడ వ్యవసాయం లేకుండానే అవుతుంది. ఇక్కడి నేల ఉర్లగడ్డకు చాలా అనువైనది. ఇక్కడి ఉర్లగడ్డ పంటను విదేశీ వర్తకులకు అమ్మి రాజు చాలా ధనం సంపాదిస్తాడు. ఇక్కడ అందరూ ఉర్లగడ్డ తప్ప మరేదీ తినరు. మనకు పెట్టిన భోజనంలో ఉర్లగడ్డతోనే రకరకాల వంటకాలు తయారయినట్టు మీరు గమనించే ఉండాలి," అన్నది హీరావతి.

"నేను ఈ దీవి చేరుతూనే అంతులేని ఉర్లగడ్డ పొలాలు చూశాను. ఉర్లగడ్డతోనే మనం బయటపడగలమని నాకు తోస్తున్నది. రాజకుమారీ, నేనొక ఆలోచన చేశాను. నేనొక మిత్రుడి వద్ద కొన్ని ఇంద్రజాల విద్యలు నేర్చి ఉన్నాను. మీరు సహాయ పడినట్టయితే నా పథకం పారవచ్చు," అన్నాడు సోమదేవుడు.

"నన్నేం చెయ్యమంటారో చెప్పండి. ఇక్కడి నుంచి బయటపడటానికి నన్ను ఏం చెయ్యమన్నా చేస్తాను," అన్నది హీరావతి.

"ఈసారి భటుడు వచ్చినప్పుడు వాడితో, మీ మనసు మారిందనీ, రాజును పెళ్ళాడ టానికి సిద్ధంగా ఉన్నాననీ చెప్పండి. మిమ్మల్ని రాజు దగ్గిరికి తీసుకుపోతారు. రాజును పెళ్ళాడటానికి ఒక నెల గడువు అడగండి. మీకు రాజభవనమంతా కలయ తిరగటానికీ, కారాగృహానికి రావటానికీ అవ కాశం దొరుకుతుంది. మీరేది అడిగినా రాజు నిరాకరించడు. ఒకటి, రెండు రోజులలో నా యుక్తి ప్రయోగించి మీకు విమోచనం కలిగిస్తాను," అన్నాడు సోమదేవుడు.

రాజకుమార్తె అతను చెప్పినట్టే చేసి చెరసాల నుంచి బయటపడింది. ఆమెను రాజు ఎంతో మర్యాదగా, అభిమాన అతిథిగా చూసుకోసాగాడు. సోమదేవుడి కోరికపై ఆమె అతనికి కొంత బంగారం ఇచ్చింది.

సోమదేవుడు ఆ బంగారాన్ని తన కాపలా దారుకు కానుకగా ఇచ్చి, "చూడు, బాబూ, నేను మంచి నీళ్ళు తాగే గాజులోటా మరీ చిన్నదిగా ఉన్నది. నాకు రెండు పెద్ద గాజు లోటాలు, బాగా ఎత్తున్నవి ఇప్పిద్దూ, నీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు.

కాపలావాడికి ఇదేమంత ప్రమాదమైన కోరికగా కనిపించలేదు. అందుచేత వాడు రెండు ఎత్తయిన పెద్ద లోటాలు తెచ్చి సోమ దేవుడికి ఇచ్చాడు. అంతేగాక, లంచం పుచ్చుకున్న కృతజ్ఞతతో వాడు సోమదేవు డితో కబుర్లు చెప్పనారంభించాడు.

"మీది చాలా చక్కని దేశం. ఇక్కడ దివ్యమైన ఉర్లగడ్డలు అవుతాయి," అన్నాడు సోమదేవుడు వాడితో.

"అవునవును. మేం కాయించే ఉర్ల గడ్డలు ప్రపంచంలో మరెక్కడా కాయవు," అన్నాడు భటుడు గర్వంతో.

"కాని నేను తలుచుకున్నానంటే మీ దేశంలో ఉర్లగడ్డ అన్నది కాకుండా చెయ్యగలను. నేను ఆజ్ఞాపించానంటే ఉర్ల గడ్డలు పెరగటం మానేస్తాయి. ఉర్లగడ్డలు నా మాట ఎలా వింటాయో నీకు రేపు చూపిస్తాను. పిడికెడు ప్రమాణంలో ఉండే ఉర్లగడ్డ ఒకటి వచ్చేటప్పుడు తీసు





కురా. వచ్చేటప్పుడు మీ రాజుగారిని సపరివారంగా వెంట బెట్టుకురా. నా శక్తి ఆయన కూడా చూస్తారు," అన్నాడు సోమదేవుడు.

సోమదేవుడి ప్రతిజ్ఞ క్షణంలో రాజుగారి చెవిన పడింది. మర్నాడు ఉదయం ఆయన తన అనుచరులతో సహా చెరసాల వద్ద హాజరయాడు.

సోమదేవుడు ఒక ఎత్తయిన గాజు లోటా పైకెత్తి అందరికీ చూపాడు. దాని నిండా నీరున్నది. రాజుగారిచ్చిన ఉర్లగడ్డను అతను తన అరిచేతిలో పట్టుకుని అది పిడికెడు ఉండటం గ్రహించాడు; దాన్ని నింపాదిగా లోటాలోకి జారవిడిచాడు. ఉర్లగడ్డ నీటిలోకి దిగసాగింది. అది గ్లాసులో దాదాపు సగం లోతుకు దిగాక అతను, "ఆగు!" అన్నాడు. ఉర్లగడ్డ దిగటం మానేసి, మధ్యలో నిలిచి పోయింది. అతను చిరునవ్వు నవ్వుతూ రాజునూ, అతని అనుచరులనూ చూశాడు. వాళ్ళ ముఖాలలో విభ్రాంతి కనిపించింది.

అతను వారితో, "ఉర్లగడ్డ నా ఆజ్ఞలను పాలిస్తుందన్నది మీరు ప్రత్యక్షంగా చూశారు గద. నేను ఏం చెయ్యమన్నా ఉర్లగడ్డ చేస్తుంది. ఇప్పుడు మంత్రం చదివి, దాన్ని అడుగుకు దింపేస్తాను," అన్నాడు.

అతను ఏవో మంత్రాలు చదువుతూ గాజు లోటాలోని నీటిని కలియబెట్టాడు. ఉర్లగడ్డ మళ్ళీ దిగటం ప్రారంభించి అడుగుకు చేరుకున్నది.

"అతన్ని విడిచెయ్యండి! అతను ఏమి కోరితే అది చెయ్యండి! అతని శక్తులు అమోఘం! మన ఉర్లగడ్డ పంటను నాశనం చెయ్యగలడు!" అన్నాడు రాజు కంగారుగా.

సోమదేవుణ్ణి చెరవిడిపించి, అతనికి రాజూ, అతని పరివారమూ తలలు వంచి ప్రణామాలు చేశారు.

"మమ్మల్ని క్షమించండి. మా మీద కనికరించి, కొంత కాలంపాటు మా ఆతిథ్యం స్వీకరించండి. మా తప్పులు మరిచిపోయి మీకు ఏది కావలిస్తే అది అంతా పట్టుకు పొండి," అన్నాడు రాజు వణికిపోతూ, గద్గద స్వరంతో.

సోమదేవుణ్ణి పల్లకీలో కూర్చోబెట్టి రాజ భవనానికి తీసుకు పోయారు. రాజు అతనికి అనేక అమూల్యమైన కానుకలు ఇచ్చి, "ఏమిటి తమరి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నేను వీలయినంత త్వరగా మా దేశానికి తిరిగిపోవాలి. మంచి నౌకను సిద్ధం చేయించండి," అన్నాడు సోమదేవుడు. తరవాత అతను హీరావతి కేసి తిరిగి, "ఏమండీ, మీ కోరిక ఏమిటి? మీరు రాజుగారిని పెళ్ళాడి ఇక్కడే ఉంటూ ఆయన సంసారం చక్కదిద్దుతారా?" అని అడిగాడు.

"లేదు. మీకు అభ్యంతరం లేకపోతే మీ వెంట వచ్చి మీ సంసారమే చక్కదిద్దుతాను," అన్నది హీరావతి.

ఒక వారానికల్లా అలూపురం రేవు నుంచి ఒక నౌక బయలుదేరింది. అందులో సోమదేవుడూ, హీరావతీ ఉన్నారు.

ఒకనాడు ప్రయాణం మధ్యలో హీరావతి సోమదేవుడితో రహస్యంగా, "నేను మీకు అందజేసినది పొడుగు తోక గల గరాటీ ఒకటీ, ఇంత ఉప్పు మాత్రమేగదా, మీ ఇంద్రజాలం ఎలా చెయ్య గలిగారు?" అని అడిగింది.

"చాలా తేలిక! అమిత తేలిక! నువ్విచ్చిన ఉప్పుతో చిక్కని ఉప్పు నీరు తయారు చేశాను. ఒక గాజు లోటాలో సగం వరకు మంచి నీరు పోశాను. తరువాత గరాటీ పెట్టి ఆ లోటాలోకే ఉప్పు నీరు నింపాదిగా పోశాను. బరువైన ఉప్పునీరు అడుగుకు చేరింది. మంచినీరు దానిపైన తేలింది. రెండు రకాలనీరూ కలిసే చోటు గుర్తు పెట్టుకున్నాను. ఉర్లగడ్డ అక్కడిదాకా దిగగానే ఆగమన్నాను. పిడికెడు ప్రమాణం గల ఉర్లగడ్డ చిక్కని ఉప్పునీటిపైన తేలుతుంది. అందుచేత ఉర్లగడ్డ ఆ నీటి మీద తేలింది. తరవాత నేను మంత్రాలు చదువుతూ లోటాలో నీరు కెలికే సరికి నీరంతా ఏకమై, ఉప్పు నీరు పలచబడి, ఉర్లగడ్డ దిగిపోయింది," అన్నాడు సోమదేవుడు. రాజకుమార్తె నవ్వి, అతని కేసి మెచ్చుకుంటూ చూసింది.



# గుణపాఠం

ఒక గ్రామంలో చిన్నప్ప అనే కుర్రవాడు చదువూ సంధ్యా లేకుండా అల్లరి చిల్లరగా వీధుల వెంట తిరిగే వాడు. వాడు ఒకనాడు వీధి పక్కన ఒక చెట్టు కింద కూర్చుని ఉండగా, నున్నటి గుండూ, పిలకా పెట్టుకుని ఒక శాస్త్రిగారు వీధివెంట పోతూ కనిపించాడు.

చిలిపితనం కొద్దీ చిన్నప్ప ఒక చిన్నరాయి తీసుకుని శాస్త్రిగారి గుండుకు గురిగా కొట్టాడు. శాస్త్రి గుండు బొప్పి కట్టి బాధపెట్టింది. ఆయన తలతిప్పి చూసేసరికి ఎటో చూసి నవ్వుకుంటూ చిన్నప్ప కనిపించాడు.

వాడికి గుణపాఠం నేర్పాలనుకుని శాస్త్రి వాణ్ణి దగ్గిరికి పిలిచి, "ఎంత మంచి గురిరా నీది!" అంటూ ఒక పావలా వాడి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

శాస్త్రి ఉద్దేశం గ్రహించలేక చిన్నప్ప ఆనందంతో పొంగిపోయి, మళ్ళీ చెట్టుకింద కూర్చున్నాడు. కొద్దిసేపట్లో ఆ దారినే మరో పెద్దమనిషి వెళుతూ ఉండటం వాడికి కనిపించింది.

ఈ సారి మరి కొంత పెద్దరాయి తీసుకుని వాడు ఆ పెద్దమనిషి తలకు గురిగా కొట్టాడు. ఆ పెద్దమనిషి మండిపడి వాణ్ణి దగ్గిరికి రమ్మన్నాడు. చిన్నప్ప సంతోషంతో పరిగెత్తుకుంటూ వచ్చి, డబ్బుల కోసం చెయ్యిచాచాడు. కాని ఆ పెద్దమనిషి వాడి రెండు దవడలూ వాయగొట్టి, "పో వెధవా!" అన్నాడు.

చిన్నప్పకు బుద్ధి వచ్చింది. వాడు మరెన్నడూ ఎవరిమీదా రాళ్ళు విసరలేదు.

—బూర్లె నాగేశ్వరరావు





# పాటముక్క

బ్రహ్మదేశంలో ఒక రాజు ఉండేవాడు. ఆయనకు సంగీతం అంటే అమిత ఇష్టం.

ఆ రాజు అచ్చుగా చంద్రకాంత శిలలతో ఒక మహా భవనం నిర్మించు కున్నాడు. అటుగా వెళ్ళే వాళ్ళు తప్పని సరిగా ఆగి దాన్ని చూసి ఆనందించి, అమిత నున్నగా ఉండే దాని గోడలను చేత్తో నిమిరేవాళ్ళు. అందుచేత రాజు, భవనం గోడలను ఎవరూ మకిల పరచకుండానూ, వాటి మీద ఏదైనా రాయకుండానూ రాత్రిం బగళ్ళు కాపలా ఏర్పాటు చేశాడు.

ఒక శీతకాలపు రాత్రి చలిలో ఒక సైనికుడు రాజభవనానికి కాపలా కాస్తు న్నాడు. చలి దుర్భరంగా ఉన్నది. జరుగు బాటు గల వాళ్ళందరూ వెచ్చగా కప్పుకుని నిద్ర పోతూంటే తనబోటి పేదవాడు చలితో వణుకుతూ విధి నిర్వహించటం చాలా అక్రమమని వాడికి తోచింది.

"నేనే రాజునై వెచ్చగా లోపల పడు కుని ఉండి, రాజు ఈ చలిలో ఇలా కాపలా కాయవలిసి వస్తే ఎంత బాగుండేది!" అను కున్నాడు సైనికుడు. కాని అలా జరగదు.

అకస్మాత్తుగా వాడికి ఒక ఆలోచన వచ్చింది. రాజుకు తన స్థితి అర్థం కావ టానికి ఒకటే ఉపాయం! వాడు ఒక బొగ్గు ముక్క తీసుకుని రాజభవనం గోడల మీద ఇలా రాశాడు:

"డబ్బుగల వాడిదే ప్రపంచం,
దరిద్రుడిది ఖాళీ కంచం!"

తాను రాసినది చూసుకుని సైనికుడు చాలాసేపు మురిసిపోయాడు. కాని, రాజు తనను కాపలా ఉంచినది ఎందుకో వాడు పూర్తిగా మరిచిపోయాడు.

తెల్లవారగానే రాజోద్యోగులు వచ్చి గోడలు తనిఖీ చేసి, సైనికుడు రాసినది చూసి, రాజుతో ఫిర్యాదు చేశారు.

టి. ఉమాపతి

రాజు రాత్రి కాపలా కాచిన సైనికుణ్ణి పిలిచి, "గోడల మీద రాసినది నువేనా?" అని అడిగాడు.

"అవును, మహారాజా! ప్రపంచంలో ధనాన్ని మించిన సుఖం లేదని నమ్మకం కలిగి అలా రాశాను," అని ధైర్యంగా సైనికుడు జవాబిచ్చాడు.

"అయితే నీకు ధనం కావాలన్న మాట!" అన్నాడు రాజు.

"అవును, మహారాజా!" అన్నాడు సైనికుడు.

"అయితే నీకు కావలిసి నంత ధనం ఇస్తాను," అన్నాడు రాజు.

ఆయనకు అనేక వందల ఎకరాల తోట ఉన్నది. దాని చుట్టూ ప్రహరీ గోడ ఉన్నది. ఆ ప్రహరీ గోడ దిగువన ఒక చీకటి కొట్టు కట్టించి, అందులో వెండి, బంగారాలు కుప్పలు పోయించి, సైనికుణ్ణి రాజు ఆ కొట్టులో బంధించాడు.

రాజకుమార్తె ఆ సైనికుడి దుస్థితికి జాలి చెంది, దిగులు పడసాగింది. ఆమెకు అతను అపరాధిలాగా కనిపించలేదు, పై పెచ్చు గొప్ప నిజాయితీ పరుడుగానూ, ధైర్యశాలి గానూ కనిపించాడు. అతని కోసం ఏదైనా చెయ్యాలని ఆమె నిశ్చయించుకున్నది.

ఆ నగరంలో ఒక స్వర్ణకారుడు ఉండే వాడు. రాజకుమార్తె అతని వద్దకు వెళ్ళి, సంగతి చెప్పి, సలహా అడిగింది. ఆ రాత్రి స్వర్ణకారుడు తోటలోని ప్రహరీగోడ వద్దకు వెళ్ళి, గోడదిగువ నుంచి ఒక రాయి తొల



గించి, చీకటికొట్టులో ఉన్న సైనికుణ్ణి, తనకు కొంత వెండి బంగారా లివ్వమని అడిగాడు. సైనికుడు అతనికి డబ్బు ఇచ్చాడు. దానితో స్వర్ణకారుడు సైనికుడికి రోజూ ప్రహరీ గోడ లోని కంతకుండా ఆహారం అందిస్తూ వచ్చాడు.

రాజకుమార్తెకు రోజు రోజుకూ ఆ సైనికుడి పై ప్రేమ పెరగ సాగింది. అతన్ని ఎలాగైనా చెర విడిపించాలని తీవ్రంగా ఆలోచించి, చివరకు ఒక ఉపాయం చేసింది. ఆమె చీకటి కొట్టులో ఉన్న వెండి బంగారాలు స్వర్ణకారుడికి ఇచ్చి, అతనిచేత ఒక వెండి మేక బొమ్మ తయారు చేయించింది. అది చక్కని సంగీతం వినిపిస్తుంది. స్వర్ణకారుడు మంచి పనితనం గలవాడు. అతను పాడే మేకను తయారు చేయటమే కాకుండా, ప్రహరీగోడ నుంచి మరికొన్ని రాళ్ళు తొలగించి, మేకను చీకటి కొట్టులో ప్రవేశ పెట్టాడు. సైనికుడు బిక్కు బిక్కుమంటూ ఒంటరిగా కూర్చున్నప్పుడు మేక నుంచి వెలువడే సంగీతం అతనికి ఆనందం చేకూర్చుతూ వచ్చింది.

ఒక నాడు రాజుగారు తోటలో వన విహారం చేస్తూండగా ఆయనకు ఎక్కడి నుంచో శ్రావ్యమైన సంగీతం వినవచ్చింది. కాని అది ఎక్కడ నుంచి వస్తున్నదీ ఆయనకు అంతు చిక్కలేదు.

మర్నాడు ఆయన తన కుమార్తెనూ, మంత్రినీ వెంట బెట్టుకుని తోటలో విహరించటానికి వచ్చాడు. మళ్ళీ ఆయనకు



సంగీతం వినిపించింది. దాని అంతు తేల్చుకోవాలని ఆయన చీకటి కొట్టును తవ్వి, పగల గొట్టించాడు. ఆ కొట్టును తాను, ఎందుకు కట్టించినదీ కూడా రాజు మరిచి పోయాడు. ఆ కొట్టులో ఇప్పుడు ఒక వెండి మేక తప్ప ఇంకేమీ లేదు. దానినుంచే సంగీతం వస్తున్నది.

రాజు ఆ మేకను తన భవనానికి తీసుకు పోయి, దాన్ని తెరిచి, అందులో ఉన్న సంగీత యంత్రాన్ని చూడాలని ప్రయత్నించాడు. కాని మేకను తెరపటం ఎవరివల్లా సాధ్యం కాలేదు. చివరకు ఆ మేకను తయారుచేసిన స్వర్ణకారుడే వచ్చి, మేక బీగాన్ని తెరిచాడు. మేక లోపల ఒక యువకుడు పడుకుని ఉండి రాజుకు కనిపించాడు.

రాజు దిగ్భ్రమ చెంది. "నువెవరు?" అని సైనికుణ్ణి అడిగాడు.

"మహారాజా, ప్రపంచాన్ని డబ్బే పరిపాలిస్తుందని గోడమీద రాసినందుకు నన్ను తమరు చీకటి కొట్టులో బంధించారు. ఇంతకూ ప్రపంచాన్ని పాలించేది డబ్బు కానే కాదు." అన్నాడు.

రాజు సైనికుడి భుజాన్నితట్టి, "మరేది?" అని అడిగాడు.

"జీవితంలో ముఖ్యమైన వాటిలో రెండోది అవసరంలో స్నేహితుడి సహాయం," అన్నాడు సైనికుడు.

"రెండోది ఎందుకు చెప్పావు? మొదటి దేమిటి?" అన్నాడు రాజు.

"ప్రపంచంలో మగవాడికి అన్నిటికన్న ముఖ్యమైనది ఆడదాని ప్రేమ," అన్నాడు సైనికుడు.

ఈ మాటలు విని రాజకుమార్తె ముఖం సిగ్గుతో ఎర్రపడింది.

జరిగిన దేమిటో రాజుకు క్షణంలో అర్థమయింది. ఆ క్షణంలోనే ఆయన తన కుమార్తెను సైనికుడికి ఇచ్చి పెళ్ళిచేయ నిశ్చయించాడు. వారిద్దరి పెళ్ళి వైభవంగా జరిగి పోయింది. పెళ్ళికి వేరే బాజాభజంత్రీలు అవసరం లేకుండా, కావలిసిన సంగీతమంతా వెండి మేక సరఫరా చేసింది.



# మనోవ్యాధి

రామాపురం అనే గ్రామంలో కృష్ణయ్య అనే వడ్డీవ్యాపారి శ్రద్ధగా వ్యాపారం చేసి, తన ఊళ్ళో వాళ్ళను చాలామందిని పేదవాళ్ళను చేసి, అంతులేని ఆస్తి సంపాదించాడు. దానితో బాటు ఆయన ఊళ్ళో వాళ్ళకు వెలి అయాడు. వడ్డీ వ్యాపారం సన్నగిలి పోయింది.

కృష్ణయ్య సంపాదించిన ఆస్తి మూడు తరాల వాళ్ళు కూర్చుని తిన్నప్పటికి సరిపోతుంది. కాని నాలుగో తరం వాళ్ళ మాట ఏమిటి అని కృష్ణయ్యకు దిగులు పట్టుకున్నది. అది మనోవ్యాధిగా పరిణమించి కృష్ణయ్య కృశించసాగాడు. ఎందరు ఎన్ని వైద్యాలు చేసినా ఆయన జబ్బు నయం కాలేదు.

అప్పుడు ఒక బంధువు ఆయనతో, "కృష్ణయ్యా, నువు నీ జీవితమంతా ఒకరిది తీసుకున్నావు గాని, ఒకరికి ఒక తృణం ఇచ్చావు కావు. మీ ఊరినిండా పేదవాళ్ళున్నారు. రోజూ ఒక పేదవాడికి దాన ధర్మం చెయ్యి. నీ రోగం నయమవుతుంది," అన్నాడు.

ఈ మాటలో గురికుదిరి కృష్ణయ్య తన పొరుగునే ఉన్న రామయ్య అనే పేదవాణి పిలిచి, "రామయ్యా, నేను పేదలకు అన్నదానమూ, ఇతర దానాలూ చేద్దా మనుకున్నాను. ఇవాళ మీ ఇంటిల్లి పాదికి భోజనం పెడతాను," అన్నాడు.

"అయ్యా, మాకివాళ రెండు పూటలకూ ఇంత తిండి ఉన్నది. రేపటి మాటంటారా? రేపు చూసుకోవచ్చు. ఇవాళ తిండికి లేని వారిని చూసి అన్నదానం చెయ్యండి," అని రామయ్య వెళ్ళిపోయాడు.

ఈ మాట విని కృష్ణయ్య నిర్ఘాంత పోయాడు. రామయ్య వంటి పేదవాడు రేపు గురించే ఆలోచించనప్పుడు నాలుగో తరం గురించి తాను బెంగ పడటం దేనికి?

కృష్ణయ్య రోజూ పేదలకు సంతర్పణలు చేసి ధనం ఖర్చుచెయ్య సాగాడు. ఆయన వ్యాధి నయమయి పోయింది.

—పప్పు రామారావు





# వింత పరీక్ష

ఒక రాజుకు ఇద్దరు భార్యలు. ఇద్దరికీ చెరొక కొడుకూ ఉండేవారు. కొంత కాలానికి పెద్ద భార్య చనిపోయింది. రాజు కొడుకులిద్దరూ ఒకరి తరవాత ఒకరు యుక్తవయస్కులయారు. రాజు తన పెద్ద భార్య కొడుకును యువరాజుగా చేసే ఆలోచనలో ఉండటం గ్రహించి, చిన్న భార్య ఎలాగయినా అతని పీడ వదిలించుకోవాలనీ, తన కొడుకుకే రాజ్యం వచ్చేటట్టు చేయాలనీ తలపెట్టి, రాజుతో, "పెద్దబ్బాయిని రత్నగిరి రాజకుమార్తెను పెళ్ళాడి రమ్మనండి," అన్నది.

రత్నగిరి రాజకుమార్తెను పెళ్ళాడటానికి వెళ్ళి తిరిగి వచ్చిన రాజకుమారుడు లేడు. అయినా, చిన్నభార్య చేతికీలుబొమ్మ అయిన రాజు అందుకు సమ్మతించాడు.

రాజకుమారుడు కూడా రత్నగిరి రాజకుమార్తెను గురించి విని ఉన్నాడు. అందులో ప్రమాదం ఉన్నదని చూచాయగా అతనికి తెలుసును కూడా. అయినా అతను సాహసి; అందుచేత, తండ్రి చెప్పినదే తడవుగా, మారు మాట్టాడకుండా రత్నగిరికి బయలుదేరి వెళ్ళాడు.

అతను రత్నగిరి రాజ్యం ప్రవేశించి ఒక సత్రంలో దిగి, రాజకుమార్తెను గురించి విచారించాడు. తనను పెళ్ళాడగోరి వచ్చిన వారికి ఆమె ఏదో కష్టమైన పని చెబుతుందనీ, ఆ పని చెయ్యటానికి సిద్ధపడిన వాడికి ఏదో పానీయం ఇస్తుందనీ, అది తాగినవాడు శిల అయిపోతాడనీ, అలా శిల అయిపోయిన వాళ్ళను ఆమె ఏదో సొరంగంలో పాతేయిస్తుందనీ అతనికి తెలియవచ్చింది.

అతను రాజకుమార్తెను పెళ్ళాడ వచ్చాడని తెలిసి కొందరు, "ఎందుకు, బాబూ, నిష్కారణంగా శిల అయిపోతావు? మీ దేశం

ఆర్. హరిప్రసాద్

వెళ్ళి, మరెవతెనైనా పెళ్ళాడి, నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండు,'' అని అతనికి హితం చెప్పారు.

కాని రాజకుమారుడికి ఆ హితం నచ్చ లేదు. అసలు రాజకుమార్తె ప్రవర్తన గురించి అందరూ చెప్పుకుంటున్నది చాలా అసహజంగా ఉన్నది. రాజకుమార్తె ఏమి పని చెబుతుంది? అది నిజంగా మానవ మాత్రులు చెయ్యలేని పని అయితే వారిని శిలలుగా మార్చవలసిన అవసరం ఏమిటి? ఆమె ఇచ్చిన పానీయాన్ని వాళ్ళు ఎందుకు తాగుతారు? వాళ్ళను శిలలుగా మార్చ టమే ఆమె ఉద్దేశమైతే వాళ్ళకు ఆమె పని ఎందుకు చెబుతుంది? ఇలాటి అను మానాలు రాజకుమారుణ్ణి బాధించాయి. వాటికి ఒక్కరు కూడా సమాధానం చెప్ప లేదు. ఆ అనుమానాలు తీర్చుకోకుండా అతను తిరిగి పోదలచలేదు.

అతను రాజభవనానికి వెళ్ళి, రాజకుమా ర్తెను కలుసుకుని, "నేను నిన్ను వివాహ మాడగోరి వచ్చాను," అన్నాడు.

"నన్ను వివాహమాడాలంటే ఒక రాక్ష సుడి తల తేవాలి. ఆ రాక్షసుడి వివరాలు చెబుతాను శ్రద్ధగా విను. సప్త సముద్రాల అవతల నీల పర్వతం ఉన్నది. ఆ పర్వ తంలో ఒక గుహ నుంచి పొగవస్తూ ఉంటుంది. ఆ పొగలో దూరి లోపలికి పోతే ఒక రాక్షసుడు కనిపిస్తాడు. వాడి తల నరికి తీసుకురావాలి. ఏ నిద్రలోనో ఉండగా వాడి తల నరకవచ్చుననుకోకు.



వాడి ప్రాణం ఒక చిలుకలో ఉన్నది. ఆ చిలుక అక్కడికి తూర్పుగా ఉన్న ఎర్ర కొండమీద, ఒక చెట్టు తొర్రలో ఉన్నది. ఆ చిలుకను పట్టుకుని దాని మెడ నరికితే రాక్షసుడు చస్తాడు. అప్పుడు నువు రాక్షసుడి తల నరికి తీసుకురావాలి," అన్నది రాజకుమార్తె.

"అలాగే తెస్తాను," అన్నాడు రాజకుమారుడు.

"అయితే నేను నీకు ఒక పానీయం ఇస్తాను. నేను చెప్పిన పని సాధించే శక్తి నీలో ఉన్న పక్షంలో ఈ పానీయం నిన్నేమీ చేయదు. అలాటి శక్తి నీలో లేని పక్షంలో నువు శిల అయిపోతావు. తాగ నిరాకరించేటట్టుంటే నిన్ను సారంగ భవనంలో బంధింపజేస్తాను," అన్నది రాజకుమార్తె.

రాజకుమారుడు పానీయం తాగుతానన్నాడు.

రాజకుమార్తె పానీయం తెచ్చి ఇచ్చింది. అతను దాన్ని తాగాడు. అతను శిల అయిపోలేదు.

"నేను శిల అయిపోలేదు గనక పని సాధించుకు వస్తానన్నమాటే. ఇప్పుడే బయలుదేరుతాను," అంటూ రాజకుమారుడు లేచాడు.

"ఆగు! ఎక్కడికీ పోనవసరం లేదు. పరీక్ష అయిపోయింది. సప్తసముద్రాల అవతల రాక్షసుడూ, చిలకా — అంతా నా కల్పన. నేను చెప్పినదంతా విని, పని చెయ్యటానికి సిద్ధపడే వీరుణ్ణి పెళ్ళాడటమే నా ఉద్దేశం. నే నిచ్చిన పానీయాన్ని ఇంతకు ముందు ఒక్కడూ తాగలేదు. వారంతా సారంగభవనంలో ఖైదీలుగా ఉన్నారు," అన్నది రాజకుమార్తె.

రాజకుమారుడు వైభవంగా రత్నగిరి రాజకుమార్తెను పెళ్ళాడాడు. లోగడ ఆమెను పెళ్లాడతామని వచ్చిన రాజకుమారులందరూ బంధవిముక్తులయారు. భార్యతో తిరిగి వచ్చిన తన సవతికొడుకును చూసి రాజుగారి చిన్న భార్య హతాశురాలయింది. రాజు తన పెద్ద భార్య కొడుకును యువరాజుగా అభిషేకించాడు.





# చదువుమాత్రలు

పూర్వకాలంలో ఒక గ్రామంలో ఒక పంతులు ఉండేవాడు. ఆయన చిన్నతనంలో నేర్చుకున్నది కొద్దిపాటి చదువు మాత్రమే. తాను పెద్ద చదువులు చదివిన వాడినని చెప్పటానికి ఆయన దగ్గిర చాలా గ్రంథాలుండేవి. అందులో ఏమున్నదీ పంతులుకే సరిగా తెలియదు. కొన్నిటిని మాత్రం పంతులు పిల్లలకు చెప్పేవాడు. పంతులుకే అర్థం గాని ఆ పుస్తకాలు పిల్లలకు అసలు అర్థమయేవి కావు.

అయినా ప్రపంచానికి ఆయన గొప్ప గురువు అనే భ్రమ ఉండేది. అలా భ్రమ కలిగేటట్టు మాటలు చెప్పటం పంతులుకు తెలుసును. ఆ కారణం చేత చాలామంది విద్యార్థులు ఆయన వద్ద చదువుకుంటూ డబ్బు ముట్టచెబుతూ ఉండేవారు.

ఈ పంతులు వద్దకు రాముడు అనే కుర్రవాడు చదువుకోవటానికి వచ్చాడు. వాడు కుశాగ్రబుద్ధి. రోకంటిపాటగా తాను చిన్నతనంలో చదువుకున్నదంతా పిల్లల చేత ఏకరు పెట్టించటం తప్ప గురువుకు ఏమీ రాదని తెలుసుకునేటందుకు రాముడికి ఎంతోకాలం పట్టలేదు. తాను పిల్లల చేత వల్లె వేయించే పుస్తకాలలో కూడా ఏమున్నదో పంతులు ఎరగడు. కుశాగ్రబుద్ధి కావటం చేత రాముడు ఆ పుస్తకాల నుంచే పంతులు చెప్పని విషయాలు అనేకం గ్రహించగలిగాడు. అందువల్ల వాడి విద్యాదాహం మరింత అయింది. కాని అది తీరాలంటే తాను ఏ కాశీ కన్నా వెళ్ళి గొప్ప పండితుల వద్ద శిష్యరికం చెయ్యాలి. అయితే, అందుకు డబ్బు కావాలి. రాముడు పేదవాడు.

కనీసం గురువుగారి వద్ద, అటక మీద ఉన్న గ్రంథాలను తనను చదువుకోనిచ్చినా కొంత ఉపయోగంగా ఉండును! కాని

బ్రహ్మజీ

పంతులు వాటిని ఎవరికీ ఇయ్యడు! అవి చెదలు పట్టిపోవలిసిందే! అప్పటికీ రాముడు పంతులుకు తెలియకుండా కొన్ని రహస్యంగా చదివాడు. అందువల్ల కూడా వాడి విద్యా దాహం మరింత అయింది.

తన సమస్య ఎలా పరిష్కారమవుతుందా అని రాముడు మథనపడుతూంటే, పంతులు మరొక సమస్యతో మథనపడసాగాడు. తాను చెప్పిన దానికన్న రాముడు ఎక్కువ గ్రహిస్తున్నాడని ఆయనకు క్రమంగా తెలియ వచ్చింది. అందరు పిల్లలలాగే వాడు కూడా తాను చెప్పినదంతా వల్లె వేస్తున్నాడు; కాని తనకు గాని, పిల్లలకు గాని అర్థం కాని విషయాల నెన్నిటినో రాముడు గ్రహి స్తున్నాడు.

ఇది చూసి పంతులుకు కంపరం పుట్టింది. ఇందులో ఏదో రహస్యం ఉండాలి. రాముడు ఎక్కడెక్కడికి పోతాడో, ఏమేమి చేస్తాడో ఆరా తీయమని ఆయన తన మిగతా శిష్యులతో రహస్యంగా చెప్పాడు. వాళ్ళు అలాగే చేశారు.

ఆటవిడుపు కాలంలో రాముడు సమీపం లోనే ఉన్న అడవిలోకి వెళ్ళి, తాను చదువు కున్నదంతా వల్లె వేస్తూ చెట్ల కింద తిరిగే వాడు; మధ్యాన్నం వేళ ఏ చెట్టు కిందనో కూర్చుని జొన్నరొట్టె తినేవాడు. దూరం నుంచి గమనించిన మిగతా శిష్యులు, రాముడు అడవిలో చెట్ల కింద తిరుగుతూ ఏవో మంత్రాలు చదువుతాడనీ, మిట్ట మధ్యాన్నం వేళ మూటకట్టి తెచ్చుకున్న



ఏవో మందు మాత్రలు మింగుతాడనీ గురువుగారితో చెప్పారు.

పరమమూఢుడైన పంతులు, "అందుకే వాడికి అంత తెలివితేటలు వచ్చాయి. వాడి రహస్యం ఏదో నేనూ తెలుసుకుంటాను," అనుకున్నాడు.

చీకటి పడేవేళకు రాముడు ఇంటికి రాగానే పంతులు వాణ్ణి గుంజకు కట్టేసి, "నీ కేవో మంత్రాలు వచ్చు. నీ దగ్గిర ఏవో మందు మాత్రలున్నాయి. వాటి సహాయంతో నువు నేను చెప్పిన దానికన్న ఎక్కువ చదువుకుంటున్నావు. ఆ మంత్రాల రహస్యమూ, మందు మాత్రలూ నాకు ఇచ్చావంటే నేను ఇంకా బాగా చదువు చెప్పి లోకోపకారం చెయ్యగలుగుతాను," అన్నాడు.

రాముడు బిత్తరపోయి తనకు మంత్రాలేవీ రావనీ, తన వద్ద మందు మాత్రలు ఏవీ లేవనీ నిజం చెప్పాడు.

కాని పంతులు పట్టరాని ఆగ్రహంతో, "నాతో అబద్ధాలాడతావా? నువు అడవిలో పచార్లు చేస్తూ మంత్రాలు చదవటమూ, కోనేటి ఒడ్డున మిట్టమధ్యాన్నం వేళ కూచుని చదువుమాత్రలు మింగటమూ నాకు తెలీదనుకున్నావా? ఆ రహస్యాలు నాకు చెప్పక పోయావో నిన్ను నరికి నక్కలకు వేసేస్తాను," అని అరిచాడు.

పంతులు తాను అనుకున్న దానికన్నా పెద్ద శుంఠ అని రాముడికి తెలిసిపోయింది. పంతులును మోసగించి తన విద్యాదాహం తీర్చుకునేటందుకు వాడికి మంచి ఉపాయం



తట్టింది. వాడు పంతులుతో, "అయ్యా, మీరు నా రహస్యం చాలా తెలివిగా కని పెట్టారు. ఇక దాచి లాభం లేదు. నాకు మంత్రాలు వచ్చిన మాట నిజమే. కాని అవి చదువుమాత్రలు తయారు చెయ్యటానికి మాత్రమే పనికి వస్తాయి. వాటిని నేను ఎవరికీ చెప్పరాదు. చెబితే తల పగిలి చచ్చి పోతాను. కాని చదువు మాత్రలు చేసి ఎవరికైనా నేను ఇయ్యవచ్చు. కొత్తవి తయారు చెయ్యవలిసి ఉంటుంది," అన్నాడు.

"వెంటనే తయారు చెయ్యి," అన్నాడు పంతులు.

"అందుకు కనీసం ఒక వారం పట్టుతుంది. నాలుగు కాసుల బంగారం మూడు రోజులపాటు పుతం పెట్టుతూ మంత్రాలు చదవాలి. తరవాత మనం చదవదలుచుకున్న గ్రంథాలన్నిటినీ భస్మం చేసి, ఆ భస్మాన్ని బంగారంతో కలిపి మాత్రలు కట్టాలి. ఆ మాత్రలు మింగితే ఆ పుస్తకాలలో ఉన్నదంతా మన మెదడుకు పట్టిపోతుంది," అన్నాడు రాముడు.

"దానికేం భాగ్యం. నాలుగు కాసుల బంగారం నే నిస్తాను. అటక మీద ఉద్గ్రంథాలు చాలా ఉన్నాయి. వాటన్నిటినీ ఉపయోగించి చదువుమాత్రలు కట్టు," అన్నాడు పంతులు.

రాముడు పుస్తకాలన్నీ తీసుకుని, బంగారం రొండిన దోపుకుని అడవిలోకి వెళ్ళాడు. గురువుగారూ, మిగతా శిష్యులూ వాడి వెంట వెళ్ళారు. వాళ్ళ సహాయంతో రాముడు బంగారాన్ని వాళ్ళు చూస్తూ ఉండగానే గోతిలో పెట్టి పుతం చెయ్యటానికి ఆరంభించాడు. వాడు బంగారం పుతం అయినదాకా అక్కడి నుంచి కదలకూడదనీ, నిద్రాహారాలు మాని నిప్పు ఆరిపోకుండా చూస్తూ మంత్రాలు చదవాలనీ అన్నాడు. అందుచేత చీకటి పడే వేళ అందరూ వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే రాముడు నిప్పు ఆర్పి, బంగారు కాసులు పైకి తీసి రొండిన పెట్టుకుని, పుస్తకాల కట్ట నెత్తి మీద పెట్టుకుని, కాశీ మార్గం పట్టి వెళ్ళిపోయాడు.





# గురువు చేసిన తప్పు

ఒక ఊళ్లో జమీందారుకు ఒక్కడే కొడుకు. ఆ ఊళ్లోనే ఉన్న సిద్ధార్యుడనే గురువు వద్ద తన కొడుకును జమీందారు ప్రవేశపెట్టాడు. కుర్రవాడికి పన్నెండేళ్ళు నిండగానే అతడి చదువు పూర్తి అయింది. జమీందారు గురువుకు ఇవ్వవలసిన కట్నాలూ, కానుకలూ ఇచ్చి యథావిధిగా సత్కరించాడు.

అప్పుడు సిద్ధార్యుడు జమీందారు కొడుకుతో రహస్యంగా, "నీ తండ్రిగారు నాకు ఇవ్వవలసినది ఇచ్చారు. కాని నువు నీ సొంతాన నీ దగ్గిర ఉన్నదేదో నాకు ఇచ్చుకుంటే గాని నీ చదువు సఫలంకాదు. నీ దగ్గర ఎంత ఉన్నది?" అన్నాడు.

పుట్టినరోజు పండగలకు వచ్చినదీ, వచ్చే పోయే బంధువులు ఇచ్చినదీ ఎంతో కొంత ఉన్నదని కుర్రవాడు అన్నాడు.

"రాత్రి రెండో ఝాములో అందరూ నిద్రపోయే వేళ ఆ డబ్బు తీసుకుని కాళికాలయానికిరా. నేను అక్కడ నీ కోసం వేచి ఉంటాను," అన్నాడు సిద్ధార్యుడు.

గురువుగారి మీది భక్తితో జమీందారు కొడుకు అలాగే చేస్తానన్నాడు.

ఊరికి ఎడంగా తోపులో కాళికాలయం ఉన్నది. రాత్రి రెండో ఝాము ఆరంభం కాగానే సిద్ధార్యుడు అక్కడికి వచ్చి, మండపంలో కూర్చున్నాడు.

అంతకు ముందే మరొక మనిషి మండపంలోకి వచ్చి, ముసుగు పెట్టుకుని, చీకటిలో స్తంభాన్ని ఆనుకుని నిద్రపోతున్నాడు. సిద్ధార్యుడు అది గమనించలేదు.

అలా నిద్రపోతున్న మనిషి పొరుగూరి రైతు. ఆ రోజు ఉదయమే వాడు గంపలో మామిడిపళ్ళు పెట్టుకుని, వాటిని జమీందారుగారి గ్రామంలో అమ్మటానికి వచ్చాడు. ఊళ్ళోకి ప్రవేశిస్తూండగానే వాడికి ఒక సాముద్రికుడు ఎదురుపడి,

జి. సూర్యకుమారి



వాడి చెయ్యి చూసి, "సాహసం చేస్తావు! లాభం కలుగుతుంది!" అని చెప్పాడు.

రైతు ఆ మనిషి చేతిలో రెండణాలు పెట్టి, మహా ఉత్సాహంగా పాడుకుంటూ ముందుకు సాగాడు.

ఉదయం పూట శాలువా కప్పుకొని కొంత దూరం నడవటం జమీందారుకు అలవాటు. ఆయన కొంత దూరంనుంచి రైతునూ, సాముద్రికుణ్ణీ చూశాడు. రైతును దగ్గిరికి రానిచ్చి జమీందారు, "ఏమిటి నీ ఉత్సాహానికి కారణం?" అని అడిగాడు.

"జోస్యుడు మంచి మాట చెప్పాడు. సాహసం చేసి లాభం పొందుతానట! సాహసం మాట దేవుడెరుగు, నా పళ్ళకు మంచి ధరవస్తే అ లాభంచాలు," అన్నాడు రైతు. వాడు జమీందారును గుర్తించలేదు.

ఆ జోస్యం ఎట్లా నిజమవుతుందో చూడాలని జమీందారుకు అనిపించింది. ఆయన రైతును ముందుకు సాగనిచ్చి, తన వెనకగా వస్తున్న నౌకరుకు ఏదో చెప్పాడు. వెంటనే ఆ నౌకరు రైతును అందుకుని అడ్డగించి, "ఈ ఊరు పళ్ళు అమ్ముకోవటానికి వచ్చి, జమీందారుగారికి కానుక పెట్టకుండా అమ్ముతావా?" అంటూ బలాత్కారంగా పళ్ళ గంప తీసుకుపోయాడు.

పళ్ళ వాడికి మహా దుఃఖం కలిగింది. లాభంమాట దేవుడెరుగు, అసలుకే మోసం వచ్చింది. బలవంతుల మీద సాహసం ఎట్లా చెయ్యటం? జోస్యుడు అబద్ధం చెప్పాడు. రైతుకు ఉత్తచేతులతో తన ఊరికి తిరిగిపో బుద్ధి కాలేదు. పిచ్చెత్తిన వాడిలాగా ఊరంతా తిరిగాడు. సాముద్రికుడి కోసం వెతికాడు, కాని అతను కనిపించ లేదు. రోజల్లా ఆ రైతు కాలుకాలిన పిల్లిలాగా తిరిగి, చీకటి పడినాక కాళికాలయం చేరి, మండపంలో స్తంభాన్ని అనుకుని కూర్చుని, అలాగే నిద్రపోయాడు.

జమీందారు గారింట అందరూ నిద్రపోయినాక జమీందారు కొడుకు తన దగ్గిర చేరి ఉన్న డబ్బంతా మూట కటుకుని,

కాశీకాలయానికి వచ్చాడు. సిద్ధార్ద్యుడు అతన్ని చూసి, "వచ్చావా నాయనా? ఎంత తెచ్చావు?" అని అడిగాడు.

"నూరు వరహాలకు కొంచెం తక్కువగా ఉన్నది." అన్నాడు జమీందారు కొడుకు.

"సరే, ఆ మూట ఇలా ఇచ్చి నువు ఇంటికి వెళ్ళిపో," అన్నాడు సిద్ధార్ద్యుడు.

కలత నిద్రలో ఉన్న రైతు అలికిడికి నిద్రలేచి, గురు శిష్యుల సంభాషణ అంతా విన్నాడు. వాడికి చాలా మంటగా ఉన్నది. సిద్ధార్ద్యుడి చేతిలో మూటచూసి, "ఛీ. ఛీ! పెట్టు అక్కడ! దొంగ వ్యవహారమా?" అని అరిచాడు.

సిద్ధార్ద్యుడు బెదిరిపోయి, ఆ మూటను అక్కడే వదిలేసి, ఇంటికి పారిపోయాడు.

రైతు మూట చేత పట్టుకుని ఆలోచనలో పడ్డాడు. జోస్యం నిజమైనట్టే ఉంది. తాను సాహసం చేశాడు; వరహాల మూట దొరికింది. కాని దాన్ని తీసుకుని తన ఊరు పోవటానికి రైతుకు ధైర్యం చాలలేదు. అది దొంగ సొమ్ములాగుంది. దాన్ని దగ్గిర ఉంచుకోవటం ప్రమాదం. ఈ డబ్బును జమీందారుకు ఇచ్చేసి, తన పళ్ళు తాను తిరిగి సంపాదిస్తే తనకు అదే పదివేలు.

ఇలా అనుకుని రైతు తెల్లవారుతూనే జమీందారుగారి ఇంటికి వెళ్ళాడు. వాడు అలా చేయటం మంచిదయింది. ఎందుకంటే రోజల్లా జమీందారు మనుషులు రైతునూ, సాముద్రికం చెప్పినవాణ్ణీ ఒక కంట కనిపెట్టే ఉన్నారు. జమీందారు కొడుకు అర్ధరాత్రి వేళ డబ్బు తీసుకుపోయి గురువుగారికి ఇచ్చిన సంగతి కూడా జమీందారుకు వాళ్ళు అర్ధ రాత్రే తెలియజేశారు.

రైతు వచ్చిన కొద్ది సేపటికే జమీందారు మనుషులు సాముద్రికుణ్ణీ, సిద్ధార్ద్యుణ్ణీ కూడా జమీందారు ఇంటికి తెచ్చారు.

జమీందారు సిద్ధార్ద్యుణ్ణి, "మీకు నేనిచ్చినది చాలకపోతే నన్నే అడగరాదా? చిన్న పిల్లవాడి చేత అలాటిపని చేయించ వచ్చునా?" అని మందలించి, రైతుకు పళ్ళ ఖరీదూ, చిన్న బహుమానమూ ఇచ్చి, సాముద్రికుడికి కూడా బహుమతి ఇచ్చి పంపేశాడు.





# దొంగ బుద్ధి

ఒకప్పుడు విదిశానగర ప్రజలు ధర్మ సమ్మతమైన విధంగా జీవించారు. రాజ శాసనాలు అన్ని రకాల వారికీ లాభసాటిగా ఉండేవి. ఎక్కడా చిన్న చిన్న దొంగ తనాలు కూడా జరిగేవి కావు.

పొరుగు దేశం నుంచి చెన్నగుప్తుడు అనే వాడు తనకున్న దంతా వెంట తీసుకుని విదిశానగరానికి వచ్చి, అక్కడ ఒక ఇల్లు కొని, ధాన్యాల వ్యాపారం సాగించాడు. వ్యాపారంలో అతనికి బాగా కలిసి వచ్చింది. తాను వ్యాపారం ప్రారంభించి ఒక సంవత్సరం పూర్తికాగానే చెన్నగుప్తుడు ఒక సమారాధన చేసి, త ముఖ్య ఖాతా దార్లందరినీ ఆహ్వానించి గొప్పగా విందు భోజనాలు పెట్టాడు.

ఖాతాదార్లు భోజనాలయినాక విశ్రాంతి తీసుకుని వెళ్ళిపోయే టప్పుడు తమ ఇళ్ళకు కావలిసిన వస్తువులు కొనుక్కున్నారు. ఒకడు శేరు బియ్యం కొని డబ్బులిస్తూ, చెన్నగుప్తుడు చూడనప్పుడు మరొక శేరు బియ్యం దొంగ తనంగా తీసుకున్నాడు. అలాగే మరొకడు శేరు శనగలకు డబ్బిచ్చి కొని, మరొక శేరు చాటుగా తన సంచీలో వేసుకున్నాడు. ఒక అతిధి పోతూ పోతూ, దొడ్లో కట్టి ఉన్న ఆవును తోలుకుపోయాడు. మిగిలిన అతిథులు కూడా చేతికందినది ఏదో ఒకటి దొంగతనంగా తీసుకుని వెళ్ళి పోయారు.

ఈ దొంగతనా లేవీ చెన్నగుప్తుడు చూడ లేదు. కాని అతని భార్య ఇల్లు సర్దుతూ, "ఏమండీ, మనం పెట్టెలో నుంచి తీసిన బంగారు పళ్ళెం కనబడదే!" అని భర్తతో అన్నది.

మరికొంత సేపటికి, దొడ్లో ఉండవలిసిన ఆవు కనబడటం లేదన్నది నౌకర్లద్వారా బయటపడింది.

ఎల్. శ్యామసుందర్

ఈ రెండు దొంగతనాలను గురించి మర్నాడు తెల్లవారగానే రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేయటానికి చెన్నగుప్తుడు నిశ్చయించుకున్నాడు.

కాని, మర్నాడు తెల్లవారుతూనే, క్రితం రోజు అతని ఇంట ఆతిధ్యం పొందిన వాళ్ళంతా చెన్నగుప్తుడి ఇంటికి వచ్చి, తాము దొంగిలించిన వస్తువులన్నీ తిరిగి ఇచ్చేశారు. బియ్యమూ, శనగలూ దొంగిలించిన వాళ్ళు తాము దొంగిలించిన సరుకుకు డబ్బు ఇచ్చేశారు. దొడ్లో కట్టి వున్న ఆవును తోలుకు పోయినవాడు ఆవును తిరిగి తెచ్చి ఇచ్చాడు.



అందరూ తాము చేసిన దొంగతనాలను గురించి చెన్నగుప్తుడికి క్షమాపణ చెప్పుకున్నారు.

ఇది చూసి సంతోషించటానికి బదులు చెన్నగుప్తుడు వాళ్ళ మీద మండిపడ్డాడు. అతను అనుకోని వస్తువులు కూడా తిరిగి వచ్చాయి గాని బంగారు పళ్ళెం తిరిగి రాలేదు.

"మీరు పచ్చిదొంగలు! మీ పశ్చాత్తాపాన్ని నేను నమ్మను. పనికిమాలిన దాన్ని తిరిగి ఇచ్చి, అయిదు వేలు ఖరీదు చేసే బంగారు పళ్ళాన్ని ఉంచుకుని, మీరందరూ దాన్ని పంచుకుందామనుకుంటున్నారు. నా బంగారు పళ్ళెం నాకు తిరిగి ఇచ్చిన దాకా మిమ్మల్ని వదలను," అన్నాడు చెన్నగుప్తుడు.

ఆ పళ్ళెం సంగతి మేమెరగమంటే మేమెరగమని అతని ఖాతాదార్లు, ప్రమాణాలు చేశారు.

"అయితే రాజసభకు నడవండి," అని చెన్నగుప్తుడు వారినందరినీ రాజసభకు తీసుకుపోయాడు.

ఈ లోపల మరొక దొంగతనం బయట పడింది.

చెన్నగుప్తుడి ఇంటినుంచి బంగారు పళ్ళాన్ని కాజేసినవాడు వాళ్ళ ఇంటి నౌకరు రంగడు అనేవాడు. వాడు చెన్నగుప్తుడి వద్ద పనికి చేరిననాటి నుంచీ, వారి ఇంటి

నుంచి ఏదో ఒక చిన్న వస్తువు ఎత్తుకు పోతూనే ఉన్నాడు. కాని కిందటి రోజు విందు భోజనాల హడా విడిలో వాడికి బంగారు పళ్ళాన్ని దొంగిలించే అవకాశం కలిగింది.

మర్నాడు ఉదయం రంగడు ఆ పళ్ళెం అమ్మి డబ్బు చేసుకుందామని ఒక షావు కారు వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో ఒక పొరుగు దేశపు పెద్దమనిషి షావుకారుతో మాట్లాడుతున్నాడు. ఆ పెద్ద మనిషి బంగారు పళ్ళాన్ని చూస్తూనే ఆనవాలు పట్టి, "ఇది నా పళ్ళెం. నా బంగారు వస్తువుల పెట్టెను ఎవరో చాలా కాలం క్రితం దొంగిలించారు. ఆ పోయిన వస్తువులలో ఈ పళ్ళెం కూడా ఉండేది," అని షావు కారుతో అన్నాడు.

వెంటనే షావుకారు ఆ పెద్దమనిషినీ, రంగణ్ణీ రాజసభకు తీసుకు పోయాడు. రాజుగారి ఎదట రంగడు తాను ఆ పళ్ళాన్ని చెన్నగుప్తుడి ఇంటి నుంచి దొంగిలించినట్టు ఒప్పుకున్నాడు.

రాజుగారు చెన్నగుప్తుణ్ణి సభకు పిలిపించి, భటుల చేత అతని ఇల్లు సోదా చేయించాడు. పెద్దమనిషి పోగొట్టుకున్న బంగారు సామానులు గల పెట్టె చెన్నగుప్తుడి ఇంట దొరికింది.

జరిగిన దేమంటే, అందరి దొంగబుద్ధికీ మూలకారణం చెన్నగుప్తుడే. అతడు తన దేశంలో దొంగగా జీవించాడు. అక్కడ తనకు ప్రమాదం కలగవచ్చునని, దొంగ సొత్తుతో విదిశానగరం చేరి అక్కడ వ్యాపారం మొదలు పెట్టాడు. అతని తిండి తిన్న ఫాపాన అతని అతిథులకు క్షణికంగా దొంగబుద్ధి కలిగింది. కాని మర్నాటికి వాళ్ళు పశ్చాత్తాప పడ్డారు. రోజూ చెన్న గుప్తుడి ఇంట తిండితినే అతడి నౌకరు రంగడు మాత్రం నికరమైన దొంగగా తయారయాడు.

రాజు పొరుగుదేశపు పెద్దమనిషికి అతడు పోగొట్టుకున్న వస్తువులన్నీ ఇప్పించి, చెన్న గుప్తుడికీ, రంగడికీ తగిన దండన విధించాడు.





# మహాభారతం

పాండవుల సేనలు కురుక్షేత్రం చేరగానే సైనిక శిబిరం నిర్మించటానికి మంచి, అనుకూల ప్రదేశం చూశారు. దానికి తృణ, కాష్ఠ, జల సమృద్ధి ఉన్నది. సమీపంలో శ్మశానాలు గాని, దేవాలయాలు గాని, ఋషుల ఆశ్రమాలు గాని లేవు. కృష్ణార్జునులు అనేక మంది రాజులను వెంటబెట్టుకుని, రథం మీద శిబిరం నిర్మించే ప్రదేశమంతా కలయతిరిగి, అక్కడక్కడా గుంపులుగా చేరి ఉన్న కౌరవ సైనికులను దూరంగా తరిమేశారు.

ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, యుయుధానుడూ, శిబిరాల నిర్మాణానికి కొలతలు పెట్టించారు. హిరణ్వతినదీ తీరాన పాండవ శిబిరాలు లేచాయి. వాటి చుట్టూ కృష్ణుడు చాలా పెద్ద అగడ్త తవ్వించాడు. పాండవ శిబిరాల వంటివే మిగిలిన రాజులందరికీ ఏర్పడ్డాయి. అన్ని శిబిరాలలోనూ సమృద్ధిగా భోజనానికీ, తాగటానికీ ఏర్పాట్లు జరిగాయి. సేన వెంట అనేక వేలమంది శిల్పులూ, వైద్యులూ ఉన్నారు. కవచాలూ, ఆయుధాలూ, తేనే, నెయ్యీ, ధూపసామగ్రి మొదలైనవి కొండలంత రాసులు పోసి ఉన్నాయి. ధర్మరాజు ప్రతి శిబిరానికీ వెళ్ళి, అన్ని సదుపాయాలూ సరిగా అమరినదీ, లేనిదీ స్వయంగా చూశాడు.

కృష్ణుడు హస్తినాపురం నుంచి బయలుదేరగానే దుర్యోధనుడు కర్ణ, శకుని, దుశ్శాసనులను పిలిపించి, "నాకూ, పాండవులకూ యుద్ధం జరగటమే కృష్ణుడు కోరేది.

51. కురుక్షేత్రం



అతను వారిని ఎలాగూ రెచ్చగొట్టుతాడు. మనం పెద్ద ఎత్తున యుద సన్నాహం చెయ్యవలసి ఉన్నది. అందుచేత మీరు చురుకుగా యుద్ధయత్నాలు చేసి, కురు క్షేత్రంలో మన శిబిరాలు నిర్మించండి. వేల కొద్దీ శిబిరాలు నిర్మాణం కావాలి. మనకు అహారం వచ్చే మార్గాలు శత్రువుకు స్వాధీనం కారాదు. వాటికి బలమైన రక్షలు కావాలి. శిబిరాలలో వస్తుసమృద్ధీ, ఆయుధ సమృద్ధీ ఉండాలి. లక్షల కొద్దీ పతాకాలూ, ధ్వజాలూ తయారు కావాలి. శిబిరాల మధ్య మార్గాలు చక్కగా చదును చేయించండి. రేపే సైన్యం కదలి శిబిరాలు చేరాలి," అని చెప్పాడు.

కౌరవ శిబిరాలు సిద్ధమయాయి. హస్తినా పురమంతా సైనిక సన్నాహపు సందడితో నిండి పోయింది. కౌరవ సేనలు సైనిక శిబిరాలు చేరుకున్నాయి.

తీరా తన దాయాదులను చంపటానికి ప్రయత్నాలన్నీ చేసిన మీదట ధర్మరాజును ధర్మ సందేహాలు బాధించాయి. ఆయన కృష్ణుడితో, "కృష్ణా, మనం చేయబోయేది ధర్మవిరుద్ధం కాదు గద?" అన్నాడు.

దానికి కృష్ణుడు, "మన రాజ్య భాగం ఇవ్వకపోతే మనం సంధి చేసుకోలేం గదా? అలాటప్పుడు యుద్ధం చెయ్యక గత్యంతరం ఏమున్నది?" అన్నాడు.

కృష్ణుడు ఇలా అన్నమీదట ధర్మరాజు యుద్ధ ప్రకటన చేశాడు. సేనలలో ఉత్సాహమూ, సంచలనమూ బయలుదేరింది.

తరవాత ధర్మరాజు భీమార్జునులతో, "వంశ నాశం జరగగూడదని మనం వన వాసమూ, అజ్ఞాత వాసమూ చేశాం, పడరాని కష్టాలు పడ్డాం. కాని ఆ వంశ నాశనం ఇప్పుడు దాపరించనే దాపరించింది. వంశ రక్షణ కోసం మనం చేసిన ప్రయత్నం ఫలించలేదు. కాని వంశ నాశనానికి మనం చేసే ప్రయత్నం ఫలించబోతున్నది. మన గురువులనూ, వృద్ధులనూ చంపి మనం ఎలాటి విజయం సంపాదిస్తామో నాకు అర్థం కాలేదు," అని దిగులుగా అన్నాడు.



"మన తల్లీ, విదురుడూ చెప్పిన దానికన్న మనకు వేరే ధర్మం ఏమున్నది? యుద్ధం జరిగే తీరాలి," అన్నారు భీమార్జునులు. అంతే నన్నాడు కృష్ణుడు.

మర్నాడు దుర్యోధనుడు తన పక్షాన వచ్చిన పదకొండు అక్షౌహిణుల సేననూ వాటి బలా బలాలను బట్టి విభజించాడు. ఉత్తమమైన సేనలు ముందూ, మధ్యమ మైనవి మధ్యలోనూ, బలహీనమైనవి వెనుకనూ ఉండేటట్టు ఏర్పాటు చేశాడు. విరిగి పోయిన రథాలను మరమ్మతు చెయ్యటానికి కర్రలు లకల సంఖ్యలో సిద్ధం చేయబడ్డాయి. రథాలన్నిటిలోనూ అమ్ముల పొదులు అమర్చ బడ్డాయి. రకరకాల ఆయుధాలూ, తైలాలూ, తదితర వస్తువులూ సేకరించబడ్డాయి.

దుర్యోధనుడు తన పదకొండు అక్షౌహిణులకూ పదకొండు మంది నాయకులను నియమించాడు. వారు: కృపుడూ, ద్రోణుడూ, శల్యుడూ, సైంధవుడూ, సుదక్షిణుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ, భూరిశ్రవసుడూ, శకునీ, బాహ్లికుడూనూ.

నిండు సభలో ఇలా అక్షౌహిణీపతులను నియమించిన అనంతరం దుర్యోధనుడు భీష్ముడి కేసి తిరిగి చేతులు జోడించి, "మహాత్మా, ఎంత పెద్దసేన అయినా తగిన నాయకుడు లేకపోతే చీమలపుట్ట లాగా చెదిరిపోతుంది. వేరు వేరు సేనాపతుల మధ్య పోటీ ఉంటుంది గాని సామరస్యం ఉండదు. పూర్వం హైహయ క్షత్రియుల మీద బ్రాహ్మణులు ధ్వజమెత్తి యుద్ధానికి తలపడ్డారు. వారి వెంట వైశ్య, శూద్ర వర్ణాలవారు కూడా హైహయులతో యుద్ధం చేశారు. కాని ఎన్ని యుద్ధాలు జరిగినా అల్పసంఖ్యలో ఉన్న హైహయులకే విజయం లభిస్తూ వచ్చింది. దానికి కారణం ఏమంటే హైహయులకు సమర్థుడైన నాయకుడు ఒకడే ఉన్నాడు. మూడు వర్ణాల సేన బహునాయకమైనది. ఈ రహస్యం తెలుసుకుని బ్రాహ్మణులు తమలో ఒక సమర్థుడికి నాయకత్వం ఇచ్చి, హైహయుల మీద

గెలిచారు. నువు నీతిలో శుక్రుడంత వాడివి. మా మేలు కోరినవాడివి. ధర్మం తప్పని వాడివి. ఓటమి ఎరగనివాడివి. అందుచేత నువు నా సేనలన్నిటికీ అధిపతివిగా ఉండి, ఇంద్రుడు దేవతలను కాపాడినట్టు మమ్మల్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడి బలాలకు సర్వసేనాపతిగా ఉండటానికి భీష్ముడు రెండు నిబంధనలు తెలిపాడు: తాను పాండవులలో ఎవరినీ చంపడు; కర్ణుడూ, తానూ ఒకేసారి యుద్ధం చెయ్యటం పొసగదు, ఎందుకంటే కర్ణుడికి తానంటే అమితమైన మత్సరం; అందుచేత ముందు కర్ణుడైనా యుద్ధరంగంలోకి రావాలి, లేదా తానైనా రావాలి.

భీష్ముడు ఇలా అనటం విని కర్ణుడు దుర్యోధనుడితో, "రాజా, భీష్ముడు జీవించి ఉండగా నేను యుద్ధరంగంలో అడుగు పెట్టను," అని మాట ఇచ్చాడు.

తరవాత దుర్యోధనుడు శాస్త్రోక్తంగా భీష్ముణ్ణి సర్వ సేనాపతిగా అభిషేకించాడు. తరవాత అతనూ, అతని తమ్ములూ, సేనలూ కురుక్షేత్రానికి తరలివెళ్ళాయి.

ఇంక యుద్ధం ఆరంభం కాబోతున్నదని విని బలరాముడు, కొందరు యాదవ వీరులను వెంట బెట్టుకుని, పాండవ శిబిరానికి వచ్చాడు. అందరు రాజులూ, పాండవులూ, కృష్ణుడూ లేచి నిలబడి ఆయనను గౌరవిం



చారు. బలరాముడు పెద్దలైన విరాట ద్రుపదులకు నమస్కారం చేసి కూర్చుని, అందరూ వింటూ ఉండగా ఇలా అన్నాడు:

"మహా భయంకరమైన యుద్ధమూ, జనక్షయమూ జరగబోతున్నది. ఇది తప్పేటట్టు లేదు. ఈ యుద్ధం నుంచి మీ రందరూ ప్రాణాలతోనూ, వికలాంగులు కాకుండానూ బయటపడగా చూస్తానని ఆశిస్తున్నాను. మనకు పాండవులవంటి బంధువులే కౌరవులూ అనీ, ఇరు పక్షాలనూ సమంగా చూడమనీ నేను కృష్ణుడికి ఎన్నో సార్లు చెప్పాను. కాని అతనికి అర్జునుడంటే ప్రాణం. పాండవు లంటే అభిమానం. నా మాట విన్నాడు కాడు. భీమ



దుర్యోధను లిద్దరూ నాకు ప్రియమైన శిష్యులే. ఇద్దరూ నా దగ్గర గదాయుద్ధంలో అరితేరిన వాళ్ళే. యుద్ధంలో కృష్ణుడి సహాయంతో పాండవులు గెలిచి తీరుతారు. కాని కౌరవుల వినాశం నేను చూడలేను. సరస్వతీ నదీ ప్రాంతాన గల పుణ్యక్షేత్రాలు సేవించ బోతున్నాను."

ఇలా చెప్పి బలరాముడు వెళ్ళిపోయాడు.

అదే సమయంలో రుక్మిణి అన్న అయిన రుక్మి ఒక అక్షౌహిణి సేనతో పాండవుల వద్దకు వచ్చి, ధర్మరాజు చేత అతిథి సత్కారాలు పొంది, సభలో అందరూ వింటూండగా అర్జునుడితో, "అర్జునా, ఈ యుద్ధంలో నీకు సహాయం కావాలంటే చెప్పు. నేను నీకు ఎలాటి భయమూ కలగ కుండా శత్రువును మట్టుపెట్టేస్తాను. పరాక్రమంలో నాకు ఎవరూ చాలరు. ఈ రాజు లందరూ ఇక్కడి నుంచి కదిలే పనిలేదు. ఆ కృపుణ్ణీ, ద్రోణుణ్ణీ నేనే చంపేసి, మీ రాజ్యం మీ కిప్పిస్తాను," అన్నాడు.

అర్జునుడు అందరి ముఖాలూ చూసి నవ్వుతూ, "వీరాగ్రేసరా, నేను భయపడే సమస్య లేదు. ఎవరి సహాయమూ లేకుండానే దుర్యోధనుణ్ణి గంధర్వుల నుంచి విడిపించాను; ఖాండవ దహనం చేయించాను; విరాటుడి గోవులను కౌరవ సేనల నుంచి మళ్ళించాను. మీరు సహాయం చేయ దలిస్తే మరెవరికైనా సహాయం చెయ్యండి. లేదా, మా వెంట ఉండి నేను ఎలా యుద్ధంచేస్తానో చూడండి," అన్నాడు.

అప్పుడు రుక్మి తన పెద్ద సేనను వెంట బెట్టుకుని దుర్యోధనుడి దగ్గిరికి వెళ్ళి, ఇలాగే ప్రగల్భాలాడాడు. దుర్యోధనుడు కూడా రుక్మి సహాయం నిరాకరించాడు. రుక్మి తన దేశానికి తిరిగి వెళ్ళాడు.

ఈ విధంగా కురుక్షేత్రంలో జరిగిన యుద్ధంలో చేరనివారు బలరాముడూ, రుక్మి మాత్రమే. మిగిలిన వారంతా ఏదో ఒక పక్షాన యుద్ధం చేశారు.

హిరణ్వతీ నదీ తీరాన శిబిరంలో ఉన్న పాండవుల వద్దకు దుర్యోధనుడు శకుని

కొడుకైన ఉలూకుణ్ణి దూతగా పంపి, ధర్మ రాజుకూ, కృష్ణుడికీ, భీమార్జునులకూ, నకుల సహదేవులకూ ఇలా పొగరుతోకూడిన సందేశం పంపాడు.

"ధర్మరాజా, నువు రుద్రాక్ష పిల్లివి. నీది పిల్లి జపం. లోకాన్ని వంచించటానికి నువు వేదాలనూ, సహనాన్నీ అవలంబించావు. ఇప్పుడైనా క్షాత్ర ధర్మం అవలంబించి యుద్ధం చెయ్యి. నువు అయిదు గ్రామాలే అడిగితే బుద్ధిపూర్వకంగానే నేను నిరాకరించి, నిన్ను యుద్ధానికి పురికొల్పాను.

"కృష్ణా, నువు మా సభలో ఏదో గారడీచేసి ఒక రూపం చూపించావు. అదేరూపంతో యుద్ధరంగంలో నా ఎదట పడు. యోధులు ఇలాటి మాయలకు ఆగ్రహిస్తారు గాని భయపడరు. యుద్ధంలో పాండవులను గెలిపించి, వారికి రాజ్యం ఇప్పిస్తానని ప్రగల్భాలాడావు. ఆ మాటలు నిలబెట్టుకో.

"భీమా, నువు తిండిపోతువు, యుద్ధానికి పనికిరావు. నా ప్రతాపం చేత నిన్ను నేను విరాటుడికి వంటలవాణ్ణి చేశాను. ధృతరాష్ట్రుడి కొడుకుల నందరినీ యుద్ధరంగంలో గెలుస్తానని ప్రతిజ్ఞలు పలికావు. ఆ ప్రతిజ్ఞలు నిలబెట్టు."

ఇదే ధోరణిలో దుర్యోధనుడు అర్జున నకుల సహదేవులకూ, ధృష్టద్యుమ్నుడికీ సందేశాలు పంపాడు. వాటిని ఉలూకుడు



తెచ్చి పాండవ శిబిరంలో అందించాడు. దుర్యోధనుడు ఊహించినట్టే అందరూ ఆగ్రహావేశం చెందారు. వారు ఉలూకుడితో, "దుర్యోధనుడు మమ్మల్ని యుద్ధానికి రెచ్చగొట్టుతున్నాడు. అతని కోరిక తీరుతుందని చెప్పు." అన్నారు.

ఉలూకుణ్ణి పంపేసి ధర్మరాజూ, ధృష్టద్యుమ్నుడూ తమ సేనలను యుద్ధరంగానికి తరలించారు. ధృష్టద్యుమ్నుడు తమ వీరులకు కౌరవవీరులను ఈ విధంగా ప్రతియోధులని నిర్ణయించాడు:

కర్ణుడికి అర్జునుడు; దుర్యోధనుడికి భీముడు; శల్యుడికి ధృష్టకేతుడు; కృపుడికి ఉత్తమౌజుడు; అశ్వత్థామకు నకులుడు;

కృతవర్మకు శైబ్యుడు; సైంధవుడికి యుయుధానుడు; భీష్ముడికి శిఖండి; శకునికి సహదేవుడు; వృషసేనుడికి అభిమన్యుడు; త్రిగర్తులకు ఉపపాండవులు; ద్రోణుడికి తాను (ధృష్టద్యుమ్నుడు.)

ఇలా కౌరవసేనలో గల యోధులందరికీ తన సేనలోని ప్రతి యోధులను నిర్ణయించి, ధృష్టద్యుమ్నుడు పాండవ సేనలను వ్యూహంగా తీర్చాడు. అతని ఉద్దేశంలో అభిమన్యుడు అర్జునుడి కన్న యుద్ధంలో ప్రతాపశాలి!

అవతల కౌరవసేనకు నాయకుడైన భీష్ముడు దుర్యోధనుడు కోరిన మీదట, రెండు పక్షాలలో గల మహావీరుల తరతమ భేదాలను ఈ విధంగా తెలిపాడు:

కౌరవసేనలో కృతవర్మా, శల్యుడూ, సైంధవుడూ, కృపుడూ, అశ్వత్థామా, ద్రోణుడూ, బాహ్లికుడూ మొదలైనవారు అతిరథులు, ఉత్తమ వీరులు. అశ్వత్థామకు ప్రాణాల మీది ఆశ అనే లోపం ఉన్నది; లేకపోతే అతనితో సమానుడైన వీరుడు రెండు సేనలలోనూ లేడు. వృషసేనుడూ, అలంబుసు డనే రాక్షసుడూ మహారథులు. సుదక్షిణుడూ, నీలుడూ, శకునీ, విందానువిందులూ మొదలైనవారు ఏకరథులు. కవచకుండలాలు పోవటం చేతా, శాపగ్రస్తుడు కావటం చేతా కర్ణుణ్ణి రథుల జాబితాలో చేర్చటానికే లేదు; అతను అర్ధరథుడు.

పాండవసేనలో, అయిదుగురు పాండవులూ అతిరథులు. వారిలో అర్జునుడు ఉభయసేనలలోకీ సాటిలేని యోధుడు; అతన్ని ఎదిరించి పోరాడే శక్తి గల భీష్మద్రోణు లిద్దరూ వయోవృద్ధులే. అభిమన్యుడూ, సాత్యకీ, ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, అతని తమ్ముడు సత్యజిత్తూ, ఘటోత్కచుడూ అతిరథుల కిందికే వస్తారు. ఉపపాండవులు అయిదుగురినీ మహారథులనవచ్చు. అలాగే, విరాటుడూ, ద్రుపదుడూ, శిశుపాలుడి కొడుకైన ధృష్టకేతుడూ మొదలైనవారు కూడా మహారథులే!






# శివశిలలు

## 6

వీరసంగమయ్య అనే అందమైన యువకుడు ఉండేవాడు. అతను శివభక్తుడు. శివుణ్ణి శరభసాళువ రూపంలో ఆరాధిస్తూ ఉండేవాడు.

అతనికి పెళ్ళి చేసే ప్రయత్నంలో ఉన్న అతని పెత్తండ్రి ఓంకారపురం వెళ్ళాడు. అక్కడ ఆయన బావమరిది ఒకాయన ఉన్నాడు. ఈ బంధువు చాలా ధనవంతుడూ, శివభక్తుడూనూ. బావమరుదు లిద్దరూ ఒకరి నొకరు చూసుకుని పరమానందం చెంది, కౌగలించుకున్నారు. అతిథికి భోజనాదికాలు ముగించి, గృహస్థు అతనితో, "బావా, ఏం పని మీద ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"శుభకార్యం నిమిత్తమే వచ్చాను. మన వీరసంగమయ్యకు పెళ్ళియీడు వచ్చింది. తగిన పిల్ల కోసం చూస్తూ మీ ఓంకారపురం వచ్చాను. నాకు చూడగా, నీ కూతురు చంద్రిణీదేవి వీరసంగమయ్యకు తగిన భార్య అనిపిస్తున్నది. మీ కేమీ అభ్యంతరం లేకపోతే ఇద్దరికీ ముడి పెట్టెయ్యవచ్చు," అన్నాడు అతిథి.

గృహస్థు పరమానందభరితుడై, "అదేం మాట, బావా? వీరసంగమయ్య కన్న మంచి వరుడు ఎక్కడ దొరుకుతాడు? నువే ముహూర్తం నిర్ణయించి, ఉభయపక్షాల బాధ్యతా మీద వేసుకుని వివాహం జరిపించు," అన్నాడు.

అప్పటికప్పుడే వివాహ ముహూర్తం ఏర్పాటయింది.

ఓంకారపుర రాజు భాస్కరుడు ఒకనాడు వాహ్యాళి నుంచి తన ఇంటికి తిరిగి వస్తూ, తమ ఇంటివాకిట నిలబడి ఉన్న చంద్రిణీదేవిని చూసి, ఆమె అందానికి



మోహపరవశుడై ఆగి, ఆమె కేసి తేరి పార చూడసాగాడు. ఆ సంగతి గమనించి చంద్రిణీదేవి చప్పున లోపలికి వెళ్ళింది.

రాజు ఆమెను గురించే ఆలోచిస్తూ తన ఇంటికి పోయి, మంత్రులను పిలిచి, ఫలాని పిల్లను తనకు పెళ్ళి చెయ్యమని చెప్పాడు. భాస్కరుడిమంత్రులు చంద్రిణీదేవి ఇంటికి వచ్చి, ఆమె తండ్రితో, "ఏమయ్యా నీ అదృష్టం! నీ కుమార్తెను రాజుగారి కిచ్చిచెయ్యి. ఆమెకు రాణి అయ్యే యోగం పట్టింది," అన్నారు.

దానికి ఆయన, "నిజమే. మా అమ్మాయికి రాజుగారు భర్తగా కావటం కన్న మహా భాగ్యం ఏ మున్నది? కాని, వ్యవహారం చెయ్యిదాటి పోయింది. పిల్లను ఒకరికి ప్రధానం చేసేశాను," అన్నాడు.

మంత్రులు వెళ్ళి రాజుతో ఈ మాట చెప్పారు. రాజు తన ఆప్తులనూ, మిత్రులనూ పిలిచి, "మీరు ఎలాగైనా చంద్రిణీదేవిని నాకు భార్యగా చెయ్యకపోతే నా ప్రాణాలు పోతాయి." అన్నాడు.

వాళ్ళు రాజు తరఫున చంద్రిణీదేవి తండ్రి వద్దకు వచ్చి, "ఎంత వెర్రివాడివయ్యా? అదృష్టం తన్నుకు వస్తుంటే అడ్డు పెడతావేమిటి? రాజుగారు తానై నీ కూతురిని చేసుకుంటా ననటమేమిటి, నువు కాదనటమేమిటి! పిల్లను రాజుగారి కిచ్చి పెళ్ళి చేసెయ్యి." అన్నారు.

దానికి ఆయన, "రాజుగారు అల్లుడు కావటం ఎంతటి మహాభాగ్యమో నాకు మీరు చెప్పాలా? కాని భోగభాగ్యాలకు ఆశ పడి నేను మాట తప్పితే మీరే నన్ను నిందించరా?" అన్నాడు.

వాళ్ళు రాజు వద్దకు వెళ్ళి, "మీరు ఈ పిల్లను మరిచిపొండి. అందమైన కన్య లకులోటా? ఆమె తండ్రి ప్రవర్తన నిజంగా ప్రశంసనీయం!" అని చెప్పారు.

వాళ్ళను పంపేసి రాజు తానే ఒంటరిగా బయలుదేరి చంద్రిణీదేవి ఇంటికి వచ్చాడు.

రాజు వస్తూ ఉండటం చూసి చంద్రిణీదేవి తల్లిదండ్రులు బెదిరిపోయారు.

చంద్రిణీదేవి వారితో భయపడ నవసరం లేదని చెప్పి, ఒంటరిగా ఎదురువెళ్ళి, "అన్న గారికి నా మీద ఏమి ఇలా దయకలిగింది?" అంటూ రాజును ఆహ్వానించింది.

"నిన్ను కోరి వచ్చినవాణ్ణి అలా సంబోధించటం అన్యాయం కాదా? నన్ను కోరి వచ్చే స్త్రీలు ఎందరో ఉండగా నాకు నీ మీద మనసుకలిగింది. నిన్ను చూసినక్షణం నుంచీ నేను విపరీతమైన విరహతాపం పొందుతూ, మరొకతె కేసే చూడలేకుండా ఉన్నాను. నిన్ను మహారాణిని చేసి, మిగిలిన రాణులందరితో బాటు నేను కూడా నీ సేవ చేస్తాను," అన్నాడు రాజు.

"రాజా, నన్ను వీరసంగమయ్యకు ఇచ్చిన క్షణం నుంచీ అతనినే భర్తగా ఎంచుకుంటున్నాను. ఆడదానికి ఇద్దరు భర్తలు ఎలా సాధ్యపడతారు?" అన్నది చంద్రిణీదేవి.

"నీ కోసం తపించి పోతున్నవాడికి ఈ ధర్మపన్నాలు ఎందుకు చెబుతున్నావు?" అని రాజు ఆమెను అడిగాడు.

తాను తన పట్టు పదిలినట్టు కనబడక పోతే రాజు ఏమైనా చెయ్యగలడని గ్రహించి, శివుడిపైనే భారం వేసి, చంద్రిణీదేవి రాజుతో, "నేను మీకు భార్య కావటమే ఈశ్వరాదేశం అయితే అలాగే కానియ్యండి. పెళ్ళికి ముందు వారంరోజులు నిష్ఠతో ఈశ్వరా



రాధన చెయ్యటం మా వంశాచారం. ఇవాళే వ్రతం ప్రారంభిస్తాను," అన్నది.

రాజు సంతోషంతో వెళ్ళిపోయాడు.

చంద్రిణీదేవి తనకూ, రాజుకూ మధ్య జరిగినదంతా తల్లి దండ్రులకు చెప్పింది. వాళ్ళు ఈ విషయమంతా తెలుపుతూ వీర సంగమయ్యకు లేఖ రాశారు. అతను పెద్దల అనుమతితో వచ్చి, రహస్యంగా చంద్రిణీ దేవిని పెళ్ళాడి, గుర్రం మీద తన భార్యతో సహా తన ఊరికి బయలుదేరాడు.

ఈ వార్త చారులవల్ల రాజుకు తెలిసింది. చంద్రిణీదేవి తనను మోసం చేసినందుకు అతను మండిపడి, తన సైనికును పిలిచి, "మీరు వెళ్ళి, వీరసంగమయ్యను చంపి,

చంద్రిణీదేవిని తీసుకురండి." అని ఆజ్ఞాపించాడు.

ముందుగా బయలుదేరిన సైనికులు వస్తూ ఉండటం చూసి సంగమయ్య,ఒంటరిగా తాను సైనికులను ఏమీ చేయలేడు గనక, తన ఇష్టదైవమైన శరభావతారుణ్ణి ధ్యానించాడు.

వెంటనే శరభసాళువ భయంకరాకారం ప్రత్యక్షమై, అగ్నేయాస్త్రంలాంటి ఆయుధాన్ని వీరసంగమయ్య కిచ్చి, "దీనితో శత్రువులను పరిమార్చు." అని చెప్పి అంతర్ధానమయింది.

వీరసంగమయ్య తనచేతిలో కత్తి ఉండటం చూసి మహానందం చెంది, దానితో సైనికులను ఎదుర్కొని, ఎడాపెడా వధ చెయ్య నారంభించాడు. ఇదంతా గుట్టమీద నిలబడి చూస్తూ రాజు నిర్ఘాంతపోయాడు.

ఇంతలో వీరసంగమయ్య తన కరవాలాన్ని ఒక శివభక్తుడి పై విసరబోయి, అతన్ని గుర్తించి, తలవంచి నమస్కారం చేశాడు. ఇది గమనించిన రాజు, వీర సంగమయ్య శివభక్తిని ఆధారం చేసుకుని అతన్ని చంపే ఉద్దేశంతో తాను కూడా శివభక్తుడి వేషం వేసుకుని, కొండదిగి వీరసంగమయ్యను చేరి, అతను తలవంచి నమస్కరించగానే మెడమీద తన కత్తితో దెబ్బవేశాడు. ఆ కత్తి పూలహారమై వీర సంగమయ్య మెడలో పడింది.

ఆ క్షణంలోనే శివుడు వృషభవాహనం మీద ప్రత్యక్షమై, వీరసంగమయ్యను వరం కోరమన్నాడు. తనకూ, తన భార్యకూ, రాజుకూ, పెళ్ళివారికీ శివసాయుజ్యం ఇప్పించమన్నాడు వీరసంగమయ్య.

"నీకు అపకారంచెయ్యదలచిన ఈపాపిష్టి రాజుకు శివసాయుజ్యం ఇయ్యమంటావా?" అని శివుడు వీరసంగమయ్యను అడిగాడు.

"మహాదేవా, ఈ రాజు శైవచిహ్నాలు ధరించి నిన్ను కళ్ళారా చూశాడు. ఇంకా ఇతనిలో పాపాలు ఎక్కడివి?" అన్నాడు వీరసంగమయ్య.

శివుడు సంతోషించి అందరినీ తన వెంట కైలాసానికి తీసుకుపోయాడు.



# 138. ఆస్ట్రేలియా ఆదిమవాసులు

ప్రపంచంలో అనేక ప్రాంతాల శిలాయుగపు జీవితం జీవించే వాళ్ళు ఇప్పటికి ఉన్నారు. ఆస్ట్రేలియాలో అలాటి వాళ్ళు, తెల్లవాళ్ళు ప్రయాణించటానికి సాధ్యంగాని ఎడారి ప్రాంతంలో మూడు వందల మంది శిలాయుగ ప్రాణులున్నారు. వాళ్ళ జీవితవిధానం ఇరవై వేల ఏళ్ళనాటిది. బొమ్మలో ఒక ఆదిమవాసి గుహలో బొమ్మలు వెయ్యటం చూడవచ్చు.



Photo by S. P. Subherwal



బహుమతి
పొందిన వ్యాఖ్య

పువ్వు వద్దు నీకు పూదేనె కావాలి

పంపినవారు :
జె. ప్రభుదాస్



పారీస్ బ్రైస్స్,
కడప.

పదవి వద్దు నాకు పూదండ కావాలి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూన్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'













చందమామ




BNK
B. N. K. PRESS
PRIVATE LIMITED.
CHANDAMAMA BUILDINGS,
MADRAS-26.

